13. జడనిధి (వ్యు) నీటికి స్థానమైనది (సముద్రము)
నీరు—అపః స్త్రీభూమ్ని వార్వారి సలిలం కమలం జలమ్।
పయః కీలాల మమృతం జీవనం భువనంవనమ్ ॥
కబన్ధ ముదకం పాథః పుష్కరం సర్వతోముఖమ్।
అమ్భోర్ణ స్తోయపానీయ నీరక్షీరామ్బుశమ్బరమ్ ॥
కృపీటం కాణ్డమస్త్రీస్యా జ్జీవనీయం కుశం విషమ్।
మేఘపుష్పం ఘనరసం త్రిషుద్వే ఆప్య మమ్మయమ్ ॥—అమః

మాడినె = నశించెనె.

ఈమైఁ = ఈవిధముగ. అడిచిపడి = త్వరపడి, రిత్త = ఒట్టి. నెఱ+వగలు = పూర్తి చింతలు. ఒయ్యనఁ = నెమ్మదిగ. 14. కర్దమము (వి) కార్యము (ప్ర). అంబు., స్రోతస్, జనిత్, అభయము = నీటిప్రవాహముచే గల్గిన రక్షణము. 16. తాఱఁ = క్షీణింపఁగా. వేఁటకకాఱులు(రూ) వేఁటకకాండ్రు. క్రందుకొనంగఁ = మూఁగగా (చుట్టు ముట్టుగా) 17. ఎత్తెలఁ = ఉఁచ, వల, కొడమ, తిత్తి మొదలగు చేపలఁబట్టు సాధనములవంటివి ఎత్తెలు. క్రువ్వఁగఁ = గ్రుచ్చఁగా. 18. ఒందింగా = పొందినట్లుగా. అమందతఁ = చుఱుకుగా (జాగ్రత్తగా). దఱిసెదఁ = సమీపించెదను. 19. గుది = గుత్తి.

21. రొంపి = బురద. తొలుచు = కడుగు. దురితంబునకుఁ = ఆపదకు. పొరదప్పి = ప్రమాదమునుదాటి. సంభ్రాంతగతిఁ = తొందరపాటుతో.

22. ఉపాయము+ఏది = ఉపాయము చెడి (ఉ. తోఁచక), పెట్టు = ధైర్యము. చకిత = చలించు. వికలభావ = ఎడబాటు భావముగల. ఇంద్రియుఁడు+ఐ = మనస్సు గలవాఁడై. 23. జడుఁడు = మూఢుఁడు.

24. అనువుతో = ఉపాయముతో. ధృతి = ధైర్యము. అఖ్యఁ = పేరుగలవాని

25. ధుర్యతఁ = భారమువహించు శక్తితో. న+అగతములు = రానట్టివి. నయ+ఆచార్యుఁడు = ధర్మముల దెలిసిన బుధుఁడు. పొరయును = పొందును.

26. పగఱు (రూ) పగవాండ్రు. పగవారు. అగ్గము+ఐ = లోకువై. ఏ+వరుసన = ఏవిధమున. విస్తరించువాఁడు = దాఁటువాఁడు.

27. లాఁగలఁ = బొఱియలయందు. మహీజము = చెట్టు. పర్యాయపదములు.

వృక్షో మహీరుహశ్శాఖీ విటపీ పాదప స్తరుః।
అనోకహః కుటస్సాలః పలాశీద్రుద్రుమాగమాః—అమ.

కొంచు—భయపడు. పులుఁగు = పిట్ట [పక్షి]. 28. ఎరలు—ఆహారములు. బారికి—హింసకు. బెగ్గలించి—భయపడి. 29. త్రెవ్వఁ—తెగునట్లు. వెరవు+అరఁగఁ—ఉపాయము కల్గునట్లుగా. అరిత్వము—విరోధము. అలవఱపు—పూను.

30. సంగతి—సహవాసము. ఉత్సంగము—ఒడి. తక్కుడు—పీడుదును.

31. ఆర్తశరణ్యుఁడవు — ఆపదలలోనివారికి దిక్కైనవాఁడవు. అనఘ — పాపములు చేయనివాఁడా. హితంబు — మేలు. పాచి — వదలి. ఓడుటఁ — భయపడుటచేత.

32. సంధి — పంచతంత్రములనొకటి [మైత్రి]. విడుగర — విడుదుల

33. ఉలూకము — గ్రుడ్లగూబ. నకులము — ముంగిస. అచటు — [దూ]అచ్చటు అచొటు, అచ్చోటు, అచోటు. నిజ + ఇచ్ఛఁ — ఇష్టమువచ్చినట్లు.

34. మూషికము — ఎలుక. ఉరిచేరులు — ఉరులత్రాళ్ళు. 35. కొనకొని — స్థిరపడి. 36. కదకఁ — పూనికతో. 37. ఊసిన — పొందిన. నెట్టన — అవశ్యము [తప్పక]. 38. తలఁతు + ఓ — తలఁతువో 40. వెసఁ — తొందరగా. 41. భావ్యము — తగినది. 43. కృపాణంబును — కత్తిని. 45. ఓడకు — భయపడకు. 46. నుగ్గు + అగుట = నుసకలగుట. ఉదాత్తభంగిగఁ — గంభీరముగా. 48. భయమోక్షణము — భయముతీరుట. ఉత్తుఁడవు — తగినవాఁడవు. 51. స్ఫురణము — తోఁచుట.

52. పెద్దఁ కదియుట — ఎక్కువగా సమీపించుట [కలియుట].

53. దీమంబులు పజ్జ = ప్రతిరూపములప్రక్క. వేఁటకాండ్రు జంతువులను భ్రమింపఁ జేయుటకై ప్రూనితో జంతువుల ప్రతిరూపము జేసియుంచెదరు. వానినిజూచి క్రూర మృగములటఁజేర వెంటనే చంపుదురు. ఉపమ. తగిలి — ఆశపడి.

54. కార్యము పొందెఁ — కార్యముకొఱకు. పాతికఁ — నోటికి.

55. ఆమిషము — మాంసము, ఉత్ + గత వికారీభూతమై — పైకిపొంగిన వికారముతో గూడినదై, నీసుత......ఏని — నీబిడ్డలు, మిత్రుల సముదాయమైనను,

57. బలుపు + ఉరిఁ — గట్టిఉరిలో కతమున — కారణమున; వలసి — కావలసి

60. సుహృత్ + భావము — మిత్రసంబంధభావము (మైత్రి)

68. కౌంతేయ + అగ్రజుఁడు — కుంతిపుత్త్రులలో పెద్దవాఁడగు ధర్మరాజు. శాంతనవునితో — శంతనుని కుమారుఁడగు భీష్మునితో. దురితంబులు — పాపములు. తొడరును — కల్గును.

69. శారిక — గోరువంక. ఆర్మిలిఁ — ప్రేమతో. దారకుఁడు — బాలకుఁడు. నొగిల్చి — వగులగొట్టి. ఎసకము — ప్రీతి. ఎసఁగఁ — కలుగఁగా.

70. అర్థిఁ — వాత్సల్యముతో. పాపజాతివడుచు — పాపములొనరించు రాచబిడ్డ మిడుక — జీవము. మిడుకి — కదలిపోవ.

71. క్రౌర్యరతులు — దుర్మార్గకార్యములందే యాసక్తిగలవారు. 73. గ్రుడ్డులు — గ్రుడ్లు. గోళ్లు — గోరులు, గోరులు, గోర్లు. 75. చేతఁ + చేతఁ — చేనేతఁ — వెనువెంటనే. 76. నొంచి — నొప్పిచేసి [చంపి], బేలుపడి — మోసపోయి. క్రమ్మఱఁ — మరల. 78. తుచ్ఛులు — నీచులు, కలఁక — కలఁత [నింద]. 82. పాయునె గూఢమై? రహస్యముగ మానిపోవునా? [పోదు]. 85. వాలి — సోఁకి, [కలిగి]. పెడఁ — పెడ్డ, వెనుకటి, [విపరీతపు]. 87. గుబ్బతిలు — మండు, బడబాగ్ని — నీటిలోనినిప్పు.

త్రేతాగ్నులు— గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము. వీనితో సభ్యము, ఆవసథ్యముఁజేర్చిన పంచాగ్నులగును. 88. ఇమ్ము+ఐన—అనుకూలమైన.

# కావ్య విమర్శ.

కవి:—ప్రస్తుత భారతభాగమును వ్రాసిన కవి తిక్కన సోమయాజి. సంస్కృత భారతమును మొదట తెనిఁగించిన ప్రసిద్ధకవులు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, వీరినే కవిత్రయ మందురు. కవితాశిల్పమున కవిత్రయమునఁదేగాక మొత్తము తెలుఁగు కవితాలోకమున నగ్రగణ్యుఁడు తిక్కన. క్రీ. శ. 1250లో "చోడ సింహాసనస్థాపనాచార్య" బిరుద విరాజితుఁడగు తిక్క భూపాలుఁడు గతించగ నతని కుమారుఁడు మనుమసిద్ధి నెల్లూరు రాజ్యపాలకుఁడయ్యెను. అతనిరాజ్యము కావలినుండి కంచివఱకు వ్యాపించియుండెను. కాని పాండ్య, హోయిసల, కాకతీయ, దేవగిరి రాజుల యంతఃకలహ కల్లోలములలో నెల్లూరు రాజ్య నలిగిపోవుచుండెను.

అట్టి సమయమున కవి తిక్కన రాజునకు కుడిభుజమై యెన్నియో మంత్రాంగములు నెఱపెను. కాకతీయ గణపతిదేవ చక్రవర్తితో రాయబారమూని రాచకార్యములఁ జక్కఁ బెట్టెను. రాజుగారిచే "మామా!" యని పిలువఁబడి మహామంత్రి, మహాకవియై వెలసెను ఇతని వంశము కలము, ఖడ్గములను చేఁబట్టి వన్నెకెక్కిన వీరుల,విద్వాంసులుద్భవించిన వంశము. ఇతని ముత్తాత మంత్రిభాస్కరుఁడు కవి. భాస్కరుని తనయుఁడు సిద్ధనామాత్యుఁడు మనుమసిద్ధి కడ మహామంత్రి. సిద్ధన తమ్ముఁడగు కొమ్మన గుంటూరుపట్టణము నకు దండనాథుఁడు. కొమ్మన కుమారుఁడే మహాభారతమున పదునెనిమిది పర్వములు రచించి భాషాయోషకు భూషణములుగఁ జేసిన తిక్కన. తిక్కన పెదతండ్రియగు సిద్ధన మంత్రి వరతనూజుఁడే తెలుఁగువెలుఁగుల వెదజల్లిన వీరవరుఁడు ఖడ్గతిక్కన. ఇట్టిది వీరి వంశము. వీరింటిపేరు కొట్టరువు వారు; కొన్నాళ్ళవెనుక గుంటూరివారనియు మారినది.

ఇతని కాలమున వీరశైవ, వైష్ణవ మతకలహములతో దేశమల్లకల్లోలమై కళ్లలమగుచుండెను, ఇతఁడు సంఘము నుద్ధరింప నద్వైతభావమున శైవవైష్ణవాభేదముగ 'హరిహరమూర్తి' ని సృష్టించి భారతము నతనికంకితమిడెను. దీనినే తన భారత రచనమున దొలుత విరాటపర్వమున—

"శ్రీయన గౌరి నాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్"

అని మహత్తర పరతత్త్వస్వరూపమగు హరిహరారాధనము జేయుఁడని ప్రజలకుఁ బ్రబోధము గావించినాఁడు. ఇతఁడు సకలశాస్త్ర పారంగతుఁడు; రాజనీతిజ్ఞుఁడు; కళామర్మజ్ఞుఁడైన కవి: వైదిక ధర్మనిరతుఁడు. ఇతఁడు యాగమొనర్చి సోమయాజి యయ్యెను. 'మనుమసిద్ధి మహీశసమస్తరాజ్య భారధౌరేయుఁడై' యుగయుగముల తెలుఁగుగడ్డలో వెలుఁగు వీరభారత కావ్యమును వెలయించినాఁడు. ఇతనికి కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుఁడను బిరుదములు సార్థకములు. ఇతని యితర రచనలు విజయసేనము, కవివాగ్బంధము, నిర్వచనోత్తరరామాయణము. ఇతని సమకాలికులు మారన కేతనాదులు.

కావ్యము:—భారతమొక వీరకావ్యము. భారతీయ జీవనము, సంస్కృతికిది ప్రతిబింబము. అందుచే ప్రపంచమందలి మహోత్కృష్టగ్రంథమనఁదగు హోమరు వ్రాసిన 'ఇలియడ్' సరసను నిల్చి విశ్వకావ్యమై విశ్వజనీనత నందినది. సంస్కృతభారత ప్రఖ్యాతికి ప్రపంచ వివిధభాషలలో దాని యనువాదములే ప్రబల నిదర్శనములు. దీనిని రచించిన మహామనీషి వేదవ్యాసమహర్షి. దీనికి "జయ" యను నామాంతరము గలదు. దుష్టశక్తి అమర్త్య శిష్టులకుఁ గల్గిన జయమే భారత యుద్ధఫలము. దానినిబట్టి దీనికి జయమను పేరుగల్గెను. సంఖ్యలనుబట్టి జ = 8, య = 1, వీనిని త్రిప్పి చదివిన 18 వచ్చును. మహాభారత రణమున నీ 18 సంఖ్యకు, సన్నిహిత సంబంధమున్నందునను నీ పేరు చెల్లినది. కావ్యసందేశమున మిక్కిలి బరువైనది లేదా భారతీయులచరిత్రను గ్గడించినదిగాన భారతమనఁబడినది, తెనుఁగు భారతమాదిపర్వమున నన్నయ వాకొన్న యట్లు

"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మ విదులు వేదాంతమనియు,
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని,
కవి వృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహమనియు,
నైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు"—ఈభారతమును భారతీయ విజ్ఞాన సర్వస్వమనవచ్చును. ఇందు లేని జ్ఞానాంశమింకే గ్రంథమున లేదనుట యతిశయోక్తిగాదు. ఇందలి విషయమునుబట్టి, దీనిని ఇతిహాసము, పురాణము, కావ్యము, శాస్త్రమనియుఁ జెప్పఁదగును. వింటే భారతము వినవలె; తింటే గారెలు తినవలెను సామెత భారతమందలి

తమ్మని నీతులు, కమనీయ ధర్మములఁబట్టి జనించినది. భారతము నన్నయ దృష్టిలో

"అమితాఖ్యానకశాఖలంబొలిచి, వేదార్థామల చ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాపారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై"

కోరిన కోరిక లీడేర్చు పారిజాతమై, పురుషార్థములను మనకుఁ బ్రబోధించుచున్నది.

చెఱకు గడలోఁ గణుపుగణుపున సారమెక్కుడున్నట్లుగాఁ బర్వపర్వమునకు రసాధిక్య మధికమగుట భారతభాగములకుఁ బర్వములని పేరుగల్గినది. ప్రధానపర్వములు ఆదినుండి స్వర్గారోహణము వఱకుఁ బదునెనిమిది. అందు మనపాఠ్యభాగము శాంతిపర్వాంతర్గతము. ఉపనిషత్తుల సారము, సర్వవేదాంత సంగ్రహము, జగద్విఖ్యాతమగు 'భగవద్గీత' భీష్మపర్వము లోనిది. ఉద్యోగ, ఆనుశాసనిక పర్వములు స్మృతి (చట్ట) శాస్త్రములు. విరాటపర్వము 'నానారసాభ్యుదయోల్లాసి' యైన ప్రబంధము, శాంతిపర్వమొక సాంఘిక రాజకీయ ధర్మశాస్త్రము. తిక్కన నాటకీయశైలిని బట్టి మహాభారతము నంతటిని నాటక సముచ్చయమనియుఁ దలంపవచ్చును. ఇట్లు భారతము సారస్వతమున నమోఘస్థానము నాక్రమించి యమరత్వమందినది.

తెలుఁగు భారతమున నాదిపర్వము, సభాపర్వము, నరణ్యపర్వమున గొంతభాగమును నన్నయ, విరాటమునుండి స్వర్గారోహణమువఱకు పదునేనిమిది పర్వములు తిక్కన. అరణ్యపర్వశేషము నెఱ్ఱాప్రెగ్గడయను కవిత్రయము విరచించిరి అందు తిక్కనభారతభాగమును మనము చదువఁబోవుచున్నాము.

కవిత:— సాధారణముగాఁ గవితావస్తుగరిమనుబట్టియో లేక ప్రతిభాశక్తినిబట్టియో కవితకు గౌరవమబ్బును, పదికాలాలుపాటు కావ్యజగత్తున నట్టికృతి బ్రతుకఁగలదు. తిక్కనకవి ప్రతిభాసంపన్నుఁడైన కవిబ్రహ్మ. తానుచేఁబట్టినభారతమా విశ్వప్రఖ్యాతవిషయగౌరవగాథ, తావిపూవుల పేరగింపు. దీనిఫలితముత్తమ కవిత, తిక్కన కవితారీతుల నెన్నుటకు తిక్కనవంటి రసజ్ఞులే కావలయునేమో: కాని పెద్దల యడుగుజాడలనుండి కొంత యరయుదము.

నన్నయ కవితాదృక్పథము వైదిక మతపునరుద్ధరణముకాఁగా తిక్కన్నది యద్వైతమతసహనశాంతిసౌఖ్యదమైనది, సంస్కృత భూయిష్ఠమైన నన్నయ కవిత్వము, కందవట్టిన యచ్చ తెలుఁగు పలుకుల విందిన తిక్కన కవిత్వము రెండును ద్రాక్షాపాకమునబడి రుచిచూచు రసార్ద్రహృదయుల యామోదమును బడయు చున్నది. నన్నయశైలి కథాకథనకముకాఁగా తిక్కన్నది నాటకీయము, మూఁడవ కవియగు ఎఱ్ఱన్న ప్రబంధపరమేశ్వరుఁడైనను, నన్నయ తిక్కనల సర్వ విషయముల ననుసరించెను, కొన్నిచోటుల నన్నయనే మిక్కుటముగా నభిమానించెను.

తిక్కన పదౌచిత్యము, సహజవర్ణనాచాతుర్యము, మానవుల వివిధసమయము లలోని మానసికభావవివరణాశక్తి, పాత్రపోషణము, నాటకీయ సంభాషణ, ప్రకృతిపరిశీలనము, కథావస్తునిర్మాణము — ఈ మున్నగు కవితాగుణములఁ దిక్కనకుఁ దిక్కనయే సాక్షి. దీనికుదాహరణములు తిక్కన భారతమున గొల్లలు.

పంచతంత్రకథలలోని పశుపక్ష్యాదులవలె ముఖ్యముగా మనపాఠ్యభాగమున మూఁడు చేపలకథ, పలితరోమశులకథ, బ్రహ్మదత్తపూజని కథలలో పాత్రములను నిండు జీవములుగ నడిపినాఁడు తిక్కన. మానవమానసికస్వభావచిత్రములు నిందు విశదముగఁ గాంచ నగును. చిన్నచిన్న కథలనిర్మాణమున కావ్యశిల్పమర్యాదలు పాటించెను. చక్కని కావ్య సందేశ మిచ్చెను.

తిక్కన కవిత లోకోక్తులతోఁగూడి జాతీయముగనుండును. శబ్దగాంభీర్యముకన్న భావగాంభీర్యమితనిలో నెక్కువ. అర్థగౌరవము, పదలాలిత్యముల కితని దందె వేసిన చెయ్యి. ఇతఁడు నిరంకుశుఁడై సంస్కృతభాగమందలి కథనుతగ్గించి రసౌచితికి భంగము గానితీరున పెంచి, తగ్గించి మార్చివ్రాసినాఁడు. చెప్పఁబోవు భావమునకు మెఱుఁగు నిచ్చు నెడల క్రొత్త పాత్రములను నితఁడు స్వకపోలకల్పితముగ సృష్టించును. కథకు భంగము గానివిధమున సహజవర్ణనలు గావించును. ఔచిత్యము నెఱిఁగి తనకథకు నగిషీవని కావ్య మర్యాదల నొనరించును. కొన్ని ప్రాత యచ్చతెలుఁగుపదములు మనకర్థముగాక పోవచ్చును గాని తిక్కన కాలమునాటి కవి వ్యవహారములోనివే. కొన్నింటి యర్థము మారిపోయినవి. ఇప్పటికివి కొన్ని నెల్లూరు మండలమున వాడుకలోనున్నవి. ఈపదముల బిగిబిగి కృతకసమాసములకు రాదు. ఇతనికి శబ్దాలంకారములన్న నంత ప్రీతిలేదు. ఉపమల నెడనెడ వాడియున్నాఁడు.

# ప్రశ్నోత్తరములు.

## భీష్ముఁడు ధర్మజునకే ధర్మరహస్యము లెఱిఁగించెను ?

## భారతపఠనమున మీ రెఱుఁగఁదగు ధర్మము లెవ్వి ?

కురుక్షేత్ర సంగ్రామము ముగిసెను. ధర్మమువైపు విజయము లభించెను. ధర్మజునికి పట్టాభిషేకము జరిగెను. అతఁడు ధృతరాష్ట్ర గాంధారుల తమయింటఁ బూజింపుచు చల్లగా రాజ్యము నేలుచుండెను. కాని యపార బంధుమిత్ర క్షయంబునకు ధర్మరాజు హృదయము పొగులుచుండెను. దీని నెఱిఁగిన శ్రీకృష్ణుఁడతని మనోవేదన మాన్పనెంచెను. అందులకై యోగవతీ తీరమున శరతల్పగతుఁడైన భీష్మునియొద్దకు ధర్మనందనుని గొనిపోయెను. కలధర్మముల ధర్మజునకుపదేశింపుము, శోకమోహగ్రస్తులగు జనుల కన్ను దెఱచుట

యేగదా మీఁబోటివారి బుద్ధి విస్తారమునకు ఫలమని యతని నియమించెను. కాని భీష్ముఁడు "బాణఘాతములచే శరీరము పులియుచున్నది. మాటాడశక్తి లేదు. నేనీకార్యమొనర్పలేన"ని ప్రార్థింప కృష్ణుఁడు గాంగేయునకు దప్పిక, ఆఁకలి, బాధ పోనడిచెను. శారీర మానస కుశలత్వము నొసంగె. అటనుండి భీష్ముఁడుత్సాహమున ధర్మరాజున కనేక నీతులు, రాజధర్మములు, సాంఘికనియమములు సాదరముగ నుపదేశించెను. ఈయుత్తమ ధర్మములు శాంతిపర్వమంతయు నిండియున్నవి. ఇందులోఁ గొన్నిధర్మములు మన ప్రస్తుత పఠనీయ భారతమున లభ్యములగుచున్నవి.

కథలద్వారా నీతుల గఱపుట సర్వసాధారణము. పసిపాపలనుండి ముదుసలులవఱకు కథల నుత్సాహించువారే. కథామూలమున నీతిబోధన మతి సులభము. అదేపనిగా నోరంత ప్రొద్దులు సూక్తులు, నీతులుచెప్పిన చప్పిడిగనుండును; వినువారి మనోవీధుల నిలువవు; దాని ప్రభావము వారిపై నిలువదు. కేవలము కథచెప్పి నీతులను చెప్పకపోయినను లోపములేదు. ఏలన కథ. కథలోని పాత్రలు వినువారి హృదయఫలకముల ప్రతిఫలించును. మంచి చెడులేవియో వారే తెలిసికొనఁగలరు. ఇందుచేతనే యిటభీష్ముఁడుద్బోధించు గొప్పధర్మములఁ గావవ్యోపాఖ్యానము, మూఁడుచేపలు, పలితరోమశులకథ, బ్రహ్మదత్త పూజనికథ అను నాల్గు కథలవలన దెలిసికొనుచున్నాము.

ఇఁక నిందలి ధర్మరహస్యములెవ్వియో వారయుదము. పారియాత్ర మను పర్వతమున గావవ్యుఁడను నొక బోయఁడుండెను, అతఁడు ధర్మబుద్ధి గలవాఁడు. స్వధర్మవర్తనుఁడు. తల్లిదండ్రులఁ బూజించువాఁడు. మునివరుల కాహారపదార్థముల నిచ్చును. పగవారి వేవురనైన చంపగలఁడు. ఇంతటి పరోపకారబుద్ధుని తమకు నాథయుఁడవు గమ్మని ప్రార్థించిరి. ఈవిషయమునుబట్టి స్వధర్మవర్తనము, గురుజనభక్తి, పరోపకారమను వర ధర్మములు పూజనీయములని తెలిసినవిగదా! అయాచితముగ వచ్చు పదవి కాస చూపక బోయఁడిట్లనియె. "అయ్యా! శిశుముని స్త్రీజనులఁ జంపరాదు. అన్యాయముగ నితరులవధించుట పాపము. స్త్రీని చెఱపట్టరాదు. అన్నింట వాఁడు జీవిని గూల్చుట పాపము. ఆవుల, బావల సంకటపెట్టరాదు. వాని హితమునకై సమరమొనర్చినను మహాపుణ్యమే. వ్యవసాయమునకు భగ్నమొనరించుట గొప్ప దురంతము. ప్రజలకు బాధగావించినవాఁడు శవమును దొలుచు పురుగువలె నశించును. ఇందలి ధర్మాధర్మములెఱిఁగి నేజెప్పినట్లుండురేని నేను మీ కొఱకయుఁడ నగుదుననెను. అందులకు వారు సంతసించి యట్లెవర్తించి సుఖముగ వర్ధిల్లిరి. కథాపాత్రలమూలమున మనోరంజకముగ భారతమున నీతు లుద్బోధింపఁబడినవి.

దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడను మూఁడు చేపలలో మందమతి దీర్ఘసూత్రుఁడు. ఈగుణములన్నియు మానవులవే. "జలనిధి చందంబున నిమ్మడువొప్పగ నిప్పుడేమి మాడెదె," యని సోమరియై, యాలోచనలేక కడకు జాలరుల చేఁజిక్కి యుక్కిరి

చిక్కిరియై వచ్చినది. దీర్ఘముగా రాఁబోవుకష్టముల నాలోచించి దీర్ఘదర్శి వేఱొక మడువును సురక్షితముగఁ జేరినది. ఆసమయమునకుఁ దట్టిన యుపాయముతో ప్రాప్తకాలజ్ఞుఁడు ప్రాణభయము బాసెను. ఇందలి భావము కడపటి పద్యములలో నెంతచక్కఁగఁ బొందుపఱచి మనకందిచ్చినది భారతము.

మూఁడవ కథలో పలితుఁడు ఎలుక, లోమశుఁడు పిల్లి. లోమశుఁడు మృగయుఁడు పన్నిన వలలోఁ జిక్కెను. ఆసమయమున పలితుఁడెర కొఱకు నటకు రాఁగా వానికొక గూబ, ముంగిస తోఁచినవి. ఎలుకకు ముందు నుయ్యి వెనుక గొయ్యి. ధైర్యమున పిల్లితో మైత్రి వహించి దాని యొడిఁజేరి, యా యాపదఁ గడచెను. గూబ, ముంగిస పోయినను, వాగ్దానము ప్రకారము ఎలుక వలను పూర్తిగఁ గొఱుకక కొఱుకుచున్నట్లు నటించెను. వేఁటకాఁడు వచ్చు సమయమున వలను త్రెంచెను. మరల పిల్లి చెవికింపుగా తనతో మైత్రి గావింపుమని ధర్మపన్నములాడెను. కాని యీ మాయమాటల కెలుక బేలుపోక, "మైత్రి గల్గియు శత్రుగుణ మెప్పుడేని జూపవచ్చును. ఏనుఁగులు ప్రతిరూపములఁ జూచి భ్రమసి శత్రులచేఁ జిక్కుటలేదా? పాములఁ బట్టునపు డెటుల దానినోటికి చేయీక రక్షించుకో వలెనో యట్లే కార్యావసరమునుబట్టి శత్రువులతో మైత్రిఁ బాటింపవలెను. కాన నీకు నేను బొరుగుననుండి సాయ మొనర్తును. నీవు మాంసాశనుఁడవు. నీకాఁకలిగొన్నప్పుడు నన్ను చంపకమానవు. ఆపదలో పరస్పర ముపాయమున సాయమొనర్చుకొంటిమి. ఇంత నెయ్యము చాలును. అని ఇంతటితో కథలోని నీతులనే గాక యెలుకచే ప్రసిద్ధమైన శుక్రనీతిని దెల్పినాఁడు భీష్మాచార్యుఁడు.

బ్రహ్మదత్త పూజని కథలో రాకుమారుఁడు శారిక పిల్లను తల పగులఁగొట్టి చంపెను. పిల్లతల్లి పూజని కోపమున రాజుకొడుకు కన్నుగ్రుడ్లు పెఱికి పైకెగరెను. బ్రహ్మదత్త రాజు దానితో " జరిగినదేదో జరిగినది. నీవల్ల పాపములేదు. నీవు నన్నువదలి వెళ్లకు. నాకు చాల విషాదముగ నున్నదనెను. కాని రాజు మానసిక ప్రవర్తనమెఱిఁగిన శారిక తిరిగి రాలేదు. ఈకథలో మన మెఱుఁగు నుదాత్తమగు ధర్మములివి. రాజులు నిష్కారణులు; మేలు మఱచెదరు! అక్రూరుల నెప్పుడు నమ్మరాదు. పాపమునకుఁ బ్రతిఫలము జేచేతనే యనుభవించెదరు. చెడ్డకుబదులు చెడ్డచేసినను పాపములేదు. మనచేత బాధపడిన వారి కడకు మనము చేరరాదు. మాటలతీపికిలోఁబడి విరోధులచెంతఁ జేరరాదు. కీడొనర్చిన పగకల్గును. పగ చెట్టులోని యగ్గివంటిది. జననీ జనకులు, అన్నదమ్ములు, బిడ్డలనే నమ్మరాదన్నచో పగవారిని నమ్మవచ్చునా? కాలవశమున మేలు గీడు జనులకబ్బును. బడబాగ్నివలె చల్లనిమాటలలో గోపమడఁగి యుండును. ఈవిధమున విసుగు జనింపని ధర్మములఁ జక్కని కథలవలన నెన్నింటినో ధర్మజునకు భీష్ముఁ డెఱింగించెను.

సందర్భ సహితవాక్యాలు :

1. శిశుజన మునిజన స్త్రీజనంబులఁ జంపఁగాదు . — 6 ప.

ఈ వాక్యము తెక్కనభారత శాంతిపర్వతములోనిది. భీష్ముఁడు ధర్మజున కనేక ధర్మములు బోధించుచుఁ గాపవ్యోపాఖ్యానము జెప్పెను కాపవ్యుఁడొక బోయవాఁడు. కాని ధర్మప్రవర్తకుఁడు: గురుజనభక్తుఁడు; పరోపకార పారీణుఁడు. అందుచే నాపాలమునగల దస్యులు వానిని తమకుఁ బ్రభువుగమ్మని ప్రార్థించిరి. అందుల కతఁడు కొన్ని ధర్మములు చెప్పి, యట్లు మీరు నడచుకొనునెడ నేను మీకొడయుఁడ నగుదునని చెప్పెను. ఆసందర్భములోనిదే యీ ధర్మవాక్యము.

పసిపిల్లల, మునుల, ఆఁడువారిని జంపరాదు. అది మహాపాపమని భావము.

సూచన:— పైపద్యమున నేయితర సందర్భమిచ్చినను నిదే జవాబు.

2. మఱిచూచి కొందమొయ్యన తఱితోఁ — 13 ప.

ఈవాక్యము తిక్కన భారత శాంతిపర్వమందలిది. భీష్ముఁడు ధర్మతనయునకు ధర్మోపదేశము చేయుచు మూఁడుచేపల కథను జెప్పెను. దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడను నవి మూఁడుచేపలు. ఇందు దీర్ఘదర్శి "సముద్రమువలె నీమడుగున్నది, ఇంతలో, నేమి మాడినది ? వృధాదిగులు వలదు, సమయమువచ్చినప్పుడు చూచికొందమ"ని తనమిత్రులతో చెప్పు సందర్భములోనిదీ వాక్యము. దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు తమబుద్ధిబలముచే ప్రాణరక్షణ మొనర్చుకొందురు. కాని దీర్ఘసూత్రుఁడు సమయము వచ్చినప్పుడు చూచికొందమను మందబుద్ధిచే నసువులబాయును. సమయము వచ్చినపు డుపాయమాలోచించుకొందమని భావము.

3. పరమ సంశయమయ్యెడు బ్రతుకుఁగాంచు — 24 ప.

ఈవాక్యము భారత శాంతిపర్వము నందలిది. భీష్ముఁడు ధర్మజునకు ధర్మబోధఁ గావించుచు మూఁడుచేపల కథను చెప్పెను. ఆకథలో దీర్ఘసూత్రుఁడను చేప ముందును గూర్చి యాలోచించక మందమతియై యాపదకు గురియయ్యెను. జాలరులచేఁ జిక్కెను. ఆయాకాలమునకుఁ దోఁచునట్టి ధైర్యముతో మెలఁగవలయుననువాఁడు ప్రాప్తకాలజ్ఞుని వలెఁ జెడిపోవునను సందర్భమున నైవిధమున బలికెను.

సమయము వచ్చినపుడాలోచించి యుచితమగు నటులొనర్తము. ఇప్పుడు తొందరేల ? అనువాఁడు పరమసందేహమగు బ్రతుకును బొందునని భావము.

4. నీకనఘ ! హితఁబు నేయవలదయ్య — 31 ప.

ఈవాక్యము భారతశాంతి పర్వాంతర్గతము. భీష్ముఁడు ధర్మరాజునకు నేక ధర్మము లెఱింగించుచున్నాఁడు. ఆసమయమున పలితరోమశుల కథ నుడివెను. అడవిలో పలితుఁ డను నొకఎలుక బొఱియలో, రోమశుఁడను పిల్లి చెట్టుమీఁదను నివసించుచుండినవి. ఒకనాఁడు రోమశుఁడొక మృగయుని వలలోఁ జిక్కెను. అత్రోవనెరకై యెలుకరాగా గూబ, ముంగిస దానిని మ్రింగఁజూచినవి. ఆయాపదఁ గడువ నెలుక పిల్లితో మైత్రి నాపేక్షించెను. తన్ను పిల్లియొడిలోఁగూర్చుండ పెట్టుకొమ్మని వేడెను. ఆమాటలకుఁ బిల్లి "నీవార్త శరణ్యుఁడవు. నీకు భగవంతుని సాక్షిగ సాయమొనర్తును. నీకు హితము సేయవలదా?" అనుచు నయమున బల్కినది.

పుణ్యాత్ముఁడా! నీకు మేలు తప్పక చేసెదనని భావము. ఇచ్చట పిల్లి వలత్రాళ్లను త్రెంచి యెలుక తన్నుద్ధరించినను ప్రతిఫలాపేక్షతో నెలుకకు "అనఘా!" అని యుబ్బించి పల్కినది.

5. నిన్ను జెందె బుద్ధి నిశ్చయంబు — 32 ప.

పైదానికి వలె సందర్భము. ఎలుక పలుకును.

6 కటా! కృతఘ్నతకు నెలవగు టొప్పునె? — 36 ప.

4వ. సందర్భము వ్రాసిదీనిఁ జేర్పుము. పిల్లియెలుకకునాశ్రయమిచ్చెను గూబ,ముంగిస భయపడి పాఱిపోయినవి. ఆపిమ్మట పిల్లిని రక్షించుట యెలుకభారము. కానియెలుక వలను త్రెంపక మెల్లమెల్లగఁ గఱచుచుండెను. ఇందులకు రోమశుఁడు కినిసి "నిన్ను కాపాడితిని. దేనికొఱకాలస్యముజేయుచున్నావు ద్రోహుఁడవు కాఁబోకుము? కటా! నీవు కృతఘ్నతకు నెలవగుట తగునా?" యని యెలుకతో ననియె.

ఎవరును చేసినమేలు మఱువరాదు. కృతఘ్నతకు నెలవగుట తగదని భావము.

7. నను నాపదఁ బాపవలదె నమ్మి రయమునన్ — 40 ప.

సందర్భము పైదానివలెనే.

నిన్ను నేను ఆపదలో కాపాడితిని. నేను దుష్టజంతువైనను నన్నును ఆదేవిధముగా నాపదఁ బాప వలదా? యని భావము.

8. అరయ నీతి విదుల తెరువుగాదు. — 47 ప.

ఈవాక్యము భారత శాంతిపర్వమునందలిది. భీష్ముఁడు ధర్మోపదేశము జేయుచున్నాఁడు. ఆసందర్భమున పలితరోమశకథ చెప్పఁబడినది. మృగయుని రాకతో పలితుఁడు రోమశునివలనుండి విముక్తుని గావించెను. చెట్టుమీఁది పలతుఁడు బొఱియలోని యెలుకతోఁ

లై విధముగ బల్కెను. నీవు నాకు మేలు జేసితివి. ఇప్పుడు మనకు మైత్రి గల్గినది. ఇక్క
మన చరితముచే సుఖము ననుభవించవలెను. కాని యీసుఖము వదలి దూరముగ వేఱు
పడి యుండవలెననుచున్నావు. ఇది నీతివాదుల పద్ధతి గాదనెను. నీతిగలవారి మార్గ మది
కాదని భావము.

9. తన్ను నొరులు నమ్మెడునట్లుయుండి యొరుల నమ్మకునికినీతి. 63ప

సందర్భము 8 వ దాని వలెనే, ఇట పద్యభావమును వివరింపుము.

10. రాజులెందుకు నమ్మికకుఁ బాత్రములె? 71 ప.

ఈవాక్యము శాంతిపర్వములోనిది. భీష్ముఁడు ధర్మజునకు ధర్మరహస్యము లెఱిఁగించుచు బ్రహ్మదత్త పూజని విషయము దెల్పెను. పూజనియను శారిక తనపిల్లను రాజతనయుఁడు చంపుటనుజూచి దుఃఖించి యీవిధముగఁ బల్కెను. శారిక యింపారు పండ్లను తన బిడ్డకిచ్చునపుడెల్ల రాజు బిడ్డకుఁగూడ నిచ్చుచుండెను. ఇంతమచ్చికతో నుండియు రాజనందనుఁడన్యాయముగఁ దనబిడ్డను చంపినాఁడు. అందుచే రాజులకు కరుణలేదు; హితము మఱచువారు. వీరినమ్మరాదని తనలో ననుకొనెను.

రాజులనేకాలమునను, నేచోటను నమ్మరాదని భావము.

11. ఏఁజేసితి మాఱొందు గీడు నెందదు నన్నుఁగా, 75ప.

పైసందర్భముతో దీనిని జేర్చుము. శారిక రాజుగారితోనన్న మాట యిది.

12. పగ జనించు నిట్లు భంగులైదు. 81ప.

10 వ సందర్భముతో దీనిని వ్రాయుము. బ్రహ్మదత్తుఁడు శారికపైఁ బగఁదీర్చుకొనుటకై దానిని తిరిగి రమ్మని మాయమాటలాడెను, కాని శారిక జాగ్రత్తపడినది. కీడుచేసిన వారికడకు రారాదని పైధర్మమును మదివెను.

విరోధకారణములను విశదము గావించినాఁడు.

13. కీడున్మేలును జనులకు మూఁడు. 85 ప.

దీనికి జవాబు 2 వ దాని వలెనే.

ఈ క్రింది పద్యముల ప్రతిపదార్థములు, భావములు, ముఖ్యములు.

54, 55.

# కథాసారాంశము.



భారత యుద్ధమున పాండవులు విజయులైరి. ధర్మజునకుఁ బట్టాభిషేకము జరిగెను. శ్రీకృష్ణుని యనుమతమున భీష్మాచార్యులు ధర్మజుని కనేక ధర్మము లుప దేశించెను. అందు మన పాఠ్యభాగమున గాపవ్యోపాఖ్యానము, మూఁడు చేపలకథ, పలిత రోమశుల కథ, బ్రహ్మదత్త పూజని కథ యను నాల్గు కథలు గొప్ప నీతులతో వెలయుచున్నవి.

పారియాత్ర పర్వతమున కాపవ్యుఁడను నొక బోయఁడుండెను. అతఁడు సహజ సద్గుణసముపేతుఁడు. అందుచే దస్యులు వానిని తమకు రాజవగు మని వేఁడిరి. అతఁడు వారికిసద్ధర్మములఁ దెల్పి యటులే ప్రవర్తిల్లు నటుల వారిని మార్చి వారి కొడ యుఁ డయ్యెను. దీర్ఘదర్శి రాఁబోవు కష్టముల గుర్తించి యెండిపోవు మడువును వదలి సురక్షితస్థానముఁ జేరెను. ప్రాప్తకాలజ్ఞుఁడప్పటికి తోఁచినట్లు జాలరుల వలను వోట కఱచి యుండి వలలఁ గడుగు నప్పుడు మెల్లన జారి నీళ్లలోఁ బడి ప్రాణరక్షణ మొనర్చు కొనెను. దీర్ఘసూత్రుఁడు మందమతి గాన జాలరుల చేఁజిక్కి చచ్చెను. మూఁడవ కథలో వలలోఁ జిక్కిన రోమశుఁడను పిల్లితో పలితుఁడను ఎలుక మైత్రి వహించి ముంగిస గూబల బారినుండి తన్నుదాను కాపాడుకొనెను. వేటకాఁడు వచ్చు సమయమున వలత్రాళ్లఁ దెంచి పిల్లి ప్రాణముల రక్షించెను. కాని పిల్లి యెంత వేడినను దూరముగ నుండుటే మంచిదని యెంచెను.

బ్రహ్మదత్తుఁడు పెంచిన శారికకొక పిల్లగలదు. దానిని రాకొమారుఁ డన్యాయ ముగఁ జంపెను. దానిచే శారికకు కోపము వచ్చెను. బదులు రాకొమారుని కన్నులు బొడిచి గగనమున కెగసెను. రాజు పగ సాధింపనెంచి దానినెంత వేడినను వాని దుష్ట బుద్ధి నెఱిఁగి శారిక తిరిగి వాని కడకు రాలేదు.

# ఉత్తరరామాయణము.

## 8 అశ్వాసము.

## లక్ష్మణనిర్యాణము.

## అర్థాదులు.

1. గర్భశుక్తిని — గర్భమనెడి ముత్తెపుచిప్పలో. రూపుగని — స్వరూపమును (ఆకృతిని) చూచి. ముక్తి+అగ్రగణ్యత — మోక్షము బొందుటలో మొట్టమొదటిస్థానమును బొందెను. దుర్వాసుఁడు: — బ్రహ్మమానస పుత్త్రుఁడు అత్రిముని. అతనిభార్య అనసూయ. వీరికి సంతానములేకుండెను. అత్రి తపస్సుజేయఁ ద్రిమూర్తులు ప్రత్యక్షమైరి. మాకళలతో మీకుపుత్త్రులు పుట్టుదురనిరి. అదేరీతిగా బ్రహ్మయంశమున జంద్రుఁడును, విష్ణ్వంశమున దత్తాత్రేయుఁడును, శివునంశమున దుర్వాసుఁడును జనించిరి.

తపస్+ధాత్రీరుహమునకు — తపస్సనెడి చెట్టునకు. ఫల+ఆకృతిఁగా — పండుఅను రూపమున, రహించెఁగా — వర్ధిల్లెను. ఈరెండుపాదముల రూపకమను నలంకారము.

విభూతి — ఐశ్వర్యము. ఆవలి(రూ)అలి. ఆళి — సమూహము. గోచరతఁగాచెందెఁగా — కాన్పించెను. మోసల (రూ) మొగసాల — ముందఱ (సమీపమున).

పూర్వగాథ: — లోకసంచారముచేయు దుర్వాసుఁడొకనాఁ డింద్రుని కడకేఁగెను అప్పుడింద్రుఁ డుద్యానవనమున విహరించుచుండెను. దుర్వాసుఁడు వానికొక పూలమాలనిచ్చెను. ఇంద్రుఁడద్దాని లెక్కఁజేయక తనయేనుఁగపై వేసెను. ఏనుఁగు దానిఁ గ్రింద బాఱవైచెను. దీనినిఁజూచి ఇంద్రాదులు నవ్విరి. అవమానము. జేసెగదాయని దుర్వాసునికి కోపము వచ్చెను. మొదలే ముక్కుపై కోపము, "నీ సిరి సముద్రములోఁబడుగాక!" యని ఇంద్రుని శపించెను.

2. జటిల+అగ్రేసర — మునులలో గొప్పవాఁడా ఏకాంత — రహస్యమైన. లంపట — శ్రమగల, చేతస్+గతి — మనోభావము. రోషాగ్ని... ఁడై. రోష+అగ్ని — రోషమనెడి అగ్నియొక్క. జ్వలత్ — మండుచున్న జ్వాలికా — మంటలవంటి. చటుల — మెఱయుచున్న, క్రూర — భయంకరమైన. కట+అక్షుఁడై — కడగంటిచూపులుగలవాఁడై. సౌమిత్రితో — సుమిత్రానందనుఁడగు లక్ష్మణునితో.

తా॥ మునివరా! యిదివేళగాదు. శ్రీరాముఁడేకాంత కార్యమున నున్నాఁడు. వేమనుఁ గొంతసేపు కోరాదు. ఇందులకు క్షమింపుడు. అని లక్ష్మణుఁడు విన్నవింప రోషాగ్ని జ్వాలలతో క్రూరకటాక్షుఁడై మరల నిట్లనెను.

3. పితామహునకు — బ్రహ్మదేవునకు. నృప+అగ్రణికి — రాజశ్రేష్ఠునకు. (రామునకు)

ఈవు (రూ) నీవు. ఈద — మీరు. ఈవలు — మీరలు. ఏను — ఏము. కినిసి — కోపించి.

5. వాసరరాజవంశమణి — సూర్యవంశమున మణివంటివాఁడగు శ్రీరాముఁడు. వాసర రాట్ + సుతుఁ — సూర్యపుత్త్రికైన యముని. దుర్వాసుని రాకమునకు శ్రీరామచంద్రుఁడు ఏకాంతమున యమునితో మాటలాడుచుండెను. యముఁడు మునివేషధారియై రామునికడకువచ్చి తాను రహస్యవిషయము బ్రహ్మనుండి కొనివచ్చితిననియు, తమ సంభాషణము నెవరు వినరాదనియు, ఒకవేళ నెవరైన సంభాషణము మధ్యలో నరుదెంచిన వానిని చంపవలెననియు శ్రీరామునిచే కఠోర ప్రతిజ్ఞగావించెను. ఇందుచే లక్ష్మణుని ద్వారము కడ నుంచి యెవరిని లోపలికి రానీయవలదని కట్టడజేసెను. కాని దుర్వాసుని శాపమునకు భయపడి లక్ష్మణుఁడు " పెక్కండ్రు మడియుకంటె నరయ నొక్కని చావు మేల"ని యెంచిన ధీశాలిగావున దుర్వాసాగమనమును అన్నకు నివేదింప సాహసించెను. ఇట్లు యమ, దుర్వాసుల రాకయే లక్ష్మణ నిర్యాణమునకుఁ గారణమైనది. బ్రహ్మ సందేశము ప్రకారము శ్రీరాముఁడును తన యవతారము చాలించి వైకుంఠమున కేఁగును.

6. ఒల్చిన — పొట్టు ఒలిచిన. బడిదములు — ఈపేరుగల భక్ష్యము. కలమ + అన్నము — కలమ మను జాతి వరిబియ్యపుటన్నము. నించి — నిండించి.

7. కీనాశుని — యమధర్మరాజుయొక్క. ఊనిన — పూనిన, (పట్టిన); 5వ. పద్య వివరణమున చెప్పినట్లు, శ్రీరాముఁడు యమునితో తమరహస్యసంభాషణ మధ్యమున వచ్చిన నెవ్వరినైన దాను చంపెదనని ప్రతిన జేసెను.

8. కటకట — అయ్యయ్యో. సూనుఁడు — కొడుకు; కాఁడుపు — యముఁడు. ఈ + వెడమాట — ఈ వ్యర్థపుమాట; అవకార్యముగలు — నీచపుఁబనులు.

9. స్రక్ + చందన + అంగన, సౌఖ్యముల్ — పూలు, చందనము, స్త్రీవలని సుఖములు. వంతఁ — చింతన్ను. ఒదవఁ — కల్గినట్లు. ఉపచరించె — సేవించెను. మత్ + అర్థమ్ముగాఁ — నాకొఱకై. శక్రజిత్ — ఇంద్రజిత్తు.

ఇంద్రజిత్తు:—రావణుని కుమారుఁడు. రామరావణ యుద్ధమున నింద్రజిత్తు రామలక్ష్మణుల నాగాస్త్రమున బంధించెను. కాని గరుడునిప్రభావమున వారు బంధవిముక్తులయిరి. మరల నింద్రజిత్తునకు లక్ష్మణునకు సంకులసమరము జరిగెను. కట్టకడవ బాణాస్త్రముచే లక్ష్మణుఁడింద్రజిత్తును జంపెను.

అతికాయుఁడు:-రావణునకు ధ్యానమాలినియందు జనించిన పుత్త్రుఁడు. మహాబలశాలి, లక్ష్మణ బ్రహ్మాస్త్రముచేఁ గూలెను.

ఇష్టహితుఁ — ఇటువంటి మంచిగోరువానిని. (ఇష్టుని) విశ్వాసి — నమ్మకమైనవానిని.

ఆప్తుఁడా — క్షేమముగోరువానివి. నొంతుఁడా (రూ) నొంచుదుఁడా — చంపుదును.

10. శోక బాష్ప + ఆకులిత + నేత్రుండు + ఐ — దుఃఖమువలని కన్నీటిబిందువులచే నెదరిన గన్నులు కలవాఁడై. పనవి — ప్రలాపించి. నూలుకొల్పి — సరిజేసికొని.

11. పెల్లనఁ — ఆధిక్యముచే. రేఁగి — విజృంభించి. పొలియఁజాకఁ — చచ్చునట్లు. తలఁకక — భయపడక (జంకక). నడికి — నిందకు.

12. అతుల గుణ + ఆభరణ — సాటిరాని మంచిగుణములను భూషణములుగాఁగలవాఁడా.

31. గూరిచి (రూ) గూర్చి. గుఱిచి. గుఱించి. కోవిదులు (వ్యు) ఏమి తెలియవివారు? (జ్ఞానులు). ధారుణి — భూమి (పర్యా).

భూర్భూమి రచలా నంతా రసా విశ్వంభరా స్థిరా
ధరాధరిత్రీ ధరణిః క్షోణీర్జ్యా కాశ్యపీ క్షితిః ॥
సర్వంసహా వసుమతీ వసుధోర్వీ వసుంధరా
గోత్రా కుః పృథివీ పృథ్వీక్ష్మావనిర్మేదినీ మహీః ॥
విపులా గహ్వరీ ధాత్రీ గౌరిలా కుంభినీ క్షమా
జగతీ రత్నగర్భాచ భూతధాత్ర్యబ్ధి మేఖలా ॥ — అమరము.

14. తొఱంగి — త్యజించి. విలసిత — ప్రకాశించు.

16. తేర్చి — విషయ విచారణమున సారాంశమును తేర్చి.

17. అనుకృతము + అంతముగాఁ — అసత్యము నటింపగా.

18. నిత్యము — శాశ్వతము. మనరా — బ్రతుకలేరా? తెగువ — సాహసము.

19. సభ్యస్తోమము — సభలోని పెద్దలసమూహము. చెట్ట — చెడ్డ. దూఱఁగఁ — దూషింపఁగ

20. ఎడపక + ఎడఁబాయక. (వదలక). శోకవిషాదమూర్తి + ఐ — ఏడ్పు. ఉపాయము తోఁచక మనసునగల్గు విచారముయొక్క యాకృతియై.

21. అడలుచు — దుఃఖించుచు. తరంగిణి — అలలుగల (నది)

నదీసరిత్। తరంగిణీ శైవలినీతటినీహ్రాదినీ ధునీ
స్రోతస్వినీ ద్వీపవతీ స్రవంతీ నిమ్నగాపగా
కూలంకషా నిర్ఝరిణీ రోధోవక్రా సరస్వతీ॥ — అమ

యోగము — పరమాత్మలో కూడిక.

22. ప్రసూనవృష్టిఁ — పువ్వులవానవను. కాహళము — ఢక్కయనువాద్యము.
ఆ + మహత్ + ఉజ్జ్వలనిధి — ఆయొక్క గొప్ప ప్రకాశమునకు స్థానమైనలక్ష్మణుని.

## కథాసారాంశము.

శ్రీరాముఁడు చక్కఁగా రాజ్యమేలుచుండెను. బ్రహ్మయానతిచే యముఁడు మునివేషమున రాముని కడకు వచ్చెను. "ఒక రహస్యమున్నది. మనము మాటలాడునప్పుడెవరు వచ్చినను వానిని జంపెదనని ప్రతిజ్ఞ సేయుము" అని చెప్పెను. రాముఁడా ప్రకారము చేసెను. ద్వారముకడ లక్ష్మణు నుంచిరి. లోపల శ్రీరామునితో యముఁడు శ్రీరాముని యవతారము చాలించి స్వర్గమునకు రావలయునని బ్రహ్మమాటయనఁ జెప్పెను.

ఇంతలో మహాకోపిష్ఠుఁడగు దుర్వాసుఁడచటి కరుదెంచెను. అప్పుడు మాట జవదాఁటని లక్ష్మణుఁడు మునికి లోపలికిఁ బోవ సమయము కాదని చెప్పెను. దుర్వాసుఁడు క్రుద్ధుఁడై "నన్నడ్డగించు వాఁడెవఁడు? నన్ను లోనికిఁ బోనియ్యనిచో నిన్ను నీవంశమును రాముని సంఘము భస్మమగునటుల శపించెదన"నెను. లక్ష్మణుఁడాలోచించి పెక్కుమంది మేలు కొఱకాత్మత్యాగమునకుఁ బూనుకొనెను. దుర్వాసుని రాక నన్నకెఱింగించెను. శ్రీరాముని గుండెలో బండపడెను; శోకతప్తుఁడయ్యెను. దుర్వాసుని బూజించి వానియాఁకలి యడఁగునటుల భోజనమిడెను. తృప్తుఁడై ముని వెడలిపోయెను.

శోకబాష్పాకులితనేత్రుఁడగు శ్రీరామచంద్రుఁ డీవిషాదవృత్తాంతమును మంత్రులకు హితులకు నివేదించెను. వారికేమియుఁ దోఁచలేదు. కులగురువు వసిష్ఠుఁడు "రామా! లోకములు నాశనమగుటకంటెఁ దమ్ముఁడెక్కువా? సత్యము దప్పకుము. ప్రతిజ్ఞాపాలనమొనర్పు"మని గట్టిగాఁ బల్కెను. రామచంద్రుఁడు తమ్ముని కొఱకెంతయో చింతించెను. తుదకుఁ జంపింప మనసురాక లక్ష్మణు నెటకేని వెడలిపొమ్మనెను. కాని యన్నవలె సత్యధర్మగుణబద్ధుఁడగు లక్ష్మణుఁడు సత్యముకొఱకై సరయూనదిలోఁ గ్రుంకి యాత్మత్యాగ మొనర్చుకొనెను. దేవేంద్రుఁడతనిని స్వర్గమునకుఁ గొంపోయెను.

## కావ్యవిమర్శ.

కవి:— మనము చదువఁబోవు ఉత్తరరామాయణ కావ్యకర్త కంకంటి పాపరాజు. ఇతఁడు సుమారు నూఱేండ్లకు ముందటికవి. పదునెన్మిదవ శతాబ్ది మధ్యభాగమున నీగ్రంథమును రచించెను. ఇప్పటి మదరాసు రాష్ట్రమున పొన్నేరితాలూకా నంటియున్న సముద్రప్రాంతమునగల పులికాటు సరస్సున రాజకీయోద్యోగిగ నుండెనఁట. సమీరకుమార విజయము, భర్తృహరి సుభాషితముల వ్రాసిన పుష్పగిరి తిమ్మన్న యితని మిత్రుఁడు. తనకావ్య నిర్మాణమున నుత్సాహము గల్పించి "కిరీటికి శౌరి తోడైనయట్లు అమ్మహాకవి సాహాయ్యమాచరించెనని పాపరాజు గ్రంథపీఠికలోఁ జెప్పుకొన్నాఁడు. కొందఱీయంశము నూఁతగాఁగొని తిమ్మకవిరచనమున తోడయ్యెనని, కొందఱు తిమ్మకవియే పూర్తి గ్రంథము

వ్రాసి ఋణవిముక్తుడై పుస్తకమును పాపరాజునకిచ్చెననియు, పాపరాజు తనపేర నాగ్రంథమును వెలయించెననియు, కట్టుకథల నల్లియున్నారు. వీనిని నమ్మరాదు. ఏలన కథా శిల్పముననుు, శైలిలోను, తిమ్మన రచన యీ గ్రంథమున గానుపించదు.

కావ్యము: — భారతీయసాహిత్యమున ప్రసిద్ధి నందిన గ్రంథములలో మొదటిది రామాయణము. అందుచే వాల్మీకి రామాయణమును నాదికావ్య మందురు. దీనికుపబల మ్ముగాఁ గ్రౌంచమిథున గాథను జెప్పుచుందురు. అంతమాత్రమున నాగరకజాతికి యంతకు ముందు కవిత లేద నలేము.

వేదములు ప్రభుసమ్మితములని, పురాణేతిహాసములు సుహృత్సమ్మితములని, కావ్యములు కాంతాసమ్మితములనియు పెద్దలందురు. రామాయణమొకకావ్యము. ప్రియురాలు తనవిభు నేవిధమున మెప్పించునో, వలచి వలపించునో, యావిధమున నీ రామాయణమును జదువువారిని సద్ధర్మములవైపు సునాయాసముగ మళ్లింపఁ గలదు.

రామాయణమొక భారతీయ సాంఘికశాస్త్రగ్రంథమనవచ్చును. సమాజధర్మము లిందు చక్కఁగఁ దెలుపఁబడియున్నవి. ఈకథ మనపిల్లల కుగ్గుబాలతో నేర్పెదము. రామాయణమున నేడుకాండములు, ఇరువదినాలుగువేల శ్లోకములున్నవి. రామాయణ కావ్య భాగములను కాండములందురు.

ఈకావ్యమును సంస్కృతముననే పెక్కురు కవులు గద్యనాటకచంపువులుగ రచించిరి. తెలుఁగుభాషలో పద్యములుగ, గద్యములుగ, ద్విపదలుగ, యక్షగానములుగ, నాటకములుగ, గేయములుగ, హరికథలుగ ననేక రీతుల బహుళ గ్రంథములు జనించినవి ఇఁక పరభాషల సంగతి పనిలేదు. ఇవియన్నియు రామాయణ కావ్యప్రఖ్యాతికి ప్రబల నిదర్శనములు. "రాఘవేశ్వరు చరిత్రము నెందఱెన్ని గతుల వర్ణించినం గ్రాలదే" యని దీని యుత్కృష్టతను కంకంటియే చాటియున్నాఁడు. తెలుఁగు రామాయణములలో ముఖ్యములైనవి. రంగనాథ, భాస్కర, నిర్వచనోత్తర, మొల్ల, గోపీనాధ, ఆంధ్రవాల్మీకి, జనమంచి, కృష్ణ, విశ్వనాధ రామాయణములు

ఇంతటి రామాయణ కవులలో నుత్తరకాండ కథను వ్రాసినవారు చాల తక్కువ. తిక్కన, కంకంటి పాపరాజుమాత్ర ముత్తరరామాయణములను వ్రాసిరి. తిక్కన రామాయణమునకంటె పాపరాజు రామాయణ మనేకవిధముల మిన్నయైనది. పాపరాజు కృతి కేమి యదృష్టమోకాని తెలుఁగుసీమలో దీనిని పురాణముగవినని నిరక్షరాస్యుఁడు నైత ముండఁడనుట సత్యదూరముగాదు.

కవిత: — ప్రబంధములకు చీడలుపట్టి క్షీణించిన యుగమున గట్టకడపట పుట్టియు, చీడలుపట్టని తెలుఁగు ప్రబంధమిది యొక్కటే. ఇందు మహాకావ్య లక్షణములన్నియు విందారుగా, నిమిడియున్నవి. ఏపట్టునను రసము చిప్పిలుచుండును. ఇందలి శైలి మధుర

మంజుల మనోహరము. కవి ప్రతిభ ప్రతిఘట్టమున ప్రతిఫలించుచున్నది. లోకోక్తులు, శబ్దాలంకారములంతట నున్నవి. ఇందు ప్రధానముగ కరుణ, శృంగార, వీరరసములు పోషింపఁబడియున్నవి. రంభారావణసంవాదము, సీతారాముల జలక్రీడలలో శృంగారమును, రావణ శ్రీరామ వీరకృత్యములందు వీరమును, సీతాప్రవాసము, ప్రస్తుత పాఠ్యభాగమగు లక్ష్మణనిర్యాణమందు కరుణమును రసవత్తరమైన ఘట్టములు.

1. లక్ష్మణనిర్యాణమును సంగ్రహముగఁ దెల్పుము.

2. లక్ష్మణనిర్యాణమును దెల్పి దానినుండి నీవు గ్రహించు ధర్మముల వ్రాయునది.

అది శ్రీరామ రాజ్యకాలము. భరతాది సోదరులు శత్రువుల జయించి రాజ్యమున శాంతిని నెలకొల్పిరి. శ్రీరాముని చల్లనిపాలనమున ప్రజలు హాయిగానుండిరి. కొంతకాలమునకు కౌసల్యాకైకేయీసుమిత్రలు దివమున కేఁగిరి. శ్రీరామాదులు అవతారముచాలించు కాలమాసన్నమైనది.

బ్రహ్మ యముని శ్రీరామచంద్రుని కడకీ యుదంతమును దెలుపఁబంపెను. జముఁడు మునివేషధారియై రామునితో "రహస్య విషయములఁ గొన్ని యేకాంతమున నాడవలయు. మన సంభాషణమెవరు వినరాదు. మధ్యనెవరైన నీతిదొలఁగి మనకడకేతెంచిన వాని నీవు చంపవలయును. ఈ నియమమును బాటించిన నారహస్యమును నివేదింతున"నియె. శ్రీరాముఁడు కొంత తడవు చింతించి, తరువాత లక్ష్మణుని బిలిచి, 'వాఁకిట కాచియుండుము. ఎవరైన నాకొఱకు వచ్చిన వేళగాదని పొమ్మని చెప్పుమ'ని నియమించెను. మాయముని తాను బ్రహ్మకడనుండి వచ్చితిననియు. నిఁక తామసము చేయక అవతారమును వదలి స్వర్గమునకు రావలసిన కాలమైనది. కాన తెలియఁబఱచితిననియు బ్రహ్మపలుకుల విన్నవించుచుండెను.

అట్టిసమయమున అత్రి–అనసూయల తపోఫలమును, రుద్రాంశ సంభూతుఁడును, ముక్కోపియునగు దుర్వాసుఁడు రాముని సభయొక్క మొగసాలకు వచ్చెను. లక్ష్మణుని గాంచి తనరాకను రామునకుఁ దెల్పుమన నతఁడు వినీతుఁడై "జటిలాగ్రేసరః ఇది వేళగాదు. రఘువంశస్వామి ఏకాంతమున గొన్నివిషయములఁ జర్చించుచున్నారు"అని మాఱు బలికెను. అంతకే దుర్వాసుఁడుగ్రకోపియై కన్నులనిప్పులు గ్రక్క "నన్నునిలుపఁ ద్రిమూర్తులకైన శక్తిలేదు. ఇఁక నీవెంత ? నావిషయము జెప్పనిచో మీబంధుసచివుల నందఱను దగ్ధులుగ శపింతుననెను. అందులకు సౌమిత్రి గడగడ వడఁకెను. పెక్కుర మృతికంటెఁ దానొక్కని మృతియే మేలని యెంచి యన్నతో ముని రాకను విన్నవించెను.

ఇనవంశమణి యముని వీడుకొల్పి దుర్వాసునికి మ్రొక్కి ఘనస్వాగత మొసంగెను.

విచ్చేసిన కార్యమేమని వినయమున బ్రశ్నింప "వేయేండ్లు తపమొనర్చి కృశించితిని. నాకు ఆఁకలి మెండైనది. దీనిని దీర్పవా ?" అని యడిగెను. వెంటనే కమ్మని భోజనమమర్చఁ బడెను. యతియు మనసార భుజించి సాగిపోయెను.

కాని యీదుర్ఘటనము రాముని హృదయమును గలఁచివైచెను. "అయ్యో! కాలుఁ డేల వచ్చెను ? నేనేమిటికిఁ బ్రతిజ్ఞ నొనర్చితిని ? నా యనుంగు సోదరుని వదలి నేనెటుల నిల్తును? నానోటితో నీకఠిన వాక్కెట్లు చెప్పుదును? తమ్ముఁడా లక్ష్మణా! యీప్రతినసాకుగా నిన్ను మృతినొందఁ జేయుటకేనా నన్నెప్పుడు నమ్మి కొలిచితివి." అని యేడ్చుచున్న అన్నతో లక్ష్మణుఁడు "నన్నుగూర్చి చింతింపకుఁడు. కోవిదు లాపదలచేఁ గలంగరు. ఎవరికి గానివిధిఁ గడువవచ్చునా? మీరు ప్రతిన ఒప్పిన ధారుణి క్రుంగదా? రాజులు స్వకుల ధర్మము మానుదురా? నన్నుత్యజింప కున్న మీరసత్య మాడినట్లగు. కారణము నేను గాన దత్ఫలము నన్ను జెందు. కావున నరపాలకా! నన్నే త్యజించి సత్యము, కీర్తిని నిల్పుఁడీ." యని ప్రార్థింప, శ్రీరాముఁడు ఖేదహృదయుఁడై కులగురువు, మంత్రులు, హితులతో జరిగిన యుదంతమును జెప్పి హిత మెఱిఁగింపుఁడని వేడెను.

సభాసదుల కేమియుఁదోఁచ లేదు. అప్పుడు వశిష్ఠుఁడు"రామా! ప్రతిన దప్పిన నబద్ధము చెప్పినటులే. అసత్యముచే ధర్మము, అధర్మముచే లోకములు నశించును. లోకములు నశించుటకంటె నొక్క సోదరుఁ డెక్కుఁడా ? సకలమనిత్యము; సత్యమొక్కటే నిత్యము. మన పూర్వరాజులు సత్యసంధులై యశము నందిరి. మీతండ్రి యబద్ధమాడ నోడియే గదా నిన్ను గానలకుఁ బంపెను. సత్యమార్గమునసే ప్రవర్తింపు"మన సభ్యులు విధిని నిందించిరి. శ్రీరాముఁడు లక్ష్మణునితో "తమ్ముఁడా! యెంత తప్పు చేసినను నీవంటి సోదరుని జంపలేను. ప్రతిభావంతులకుఁ జంపుటయు,విడచుటయు నొక్కటే. నిన్ను త్యజించితిని. నీయిష్టమైన చోటికి పొమ్మ"నెను. అందులకు శోకవిషాదమూర్తి సౌమిత్రి, యన్న పాదములకు సాఁగిలి మ్రొక్కి-సభయంతయు గోడునవేడ్చుచుండ వెడలి పోయెను. సరయూనదిలోఁ గ్రుంకి యోగశక్తిని తన తొల్లింటి రూపము దాల్చెను. ఇంతలో దేవేంద్రుఁడు పూలవాన గురిపించుచు స్వర్గమునకుఁ గొంపోయెను.

ఇది కరుణ రస భరిత ఘట్టము. దీనిచే శ్రీరాముని నవ్యనవనీతపునీతకోమల హృదయముపెలియు చున్నది. రాజధర్మముల నొకయక్షర మేనితప్పని నృపుఁడు శ్రీరాముఁడు, అందులకే వనవాసము, సీతా వియోగమును భరించెను. కాని సోదరుని మరణమునకుఁ దాను కారణభూతుఁడైనప్పుఁ డతఁడు పడిన బాధ, దుఃఖ మలవి గానిది. సత్యధర్మపాలనమువలె నితని యంచలి సోదరప్రేమ పవిత్రమైనది. పెద్దలతోఁ జర్చించెను. కుల గురువు నైతము లక్ష్మణ మృతికేదాటి జూపెను. కాని తన ప్రియసోదరుని దానెట్లు చంపఁగలఁడు? అందుకే యెటకేని బొమ్మని మార్గాంతరము జూపెను. ఇఁక లక్ష్మణుఁడట్టి యన్నకుఁ దగిన తమ్ముఁడే. అతని గురుజనభక్తి, సోదరప్రేమ,

ఆత్మత్యాగము, ప్రజానురంజనము లమోఘములు. "పెక్కండ్రు మడియుకంటె నరయ నొక్కనిఁజావు మేల"ను నితని వాక్కు ఇతని త్యాగమయ జీవితమునకు గీటురాయి. ఇట్టి సుగుణశోభితు లగు శ్రీరామలక్ష్మణుల జీవితములు మనకాదర్శప్రాయములు గదా!

## శ్రీరాముని గుణశీలములు.

శ్రీరాముఁడు ప్రతిజ్ఞాపాలకుఁడు. గురుమునిజనభక్తుఁడు. భ్రాతృవత్సలుఁడు. ప్రజాభిప్రాయ మెఱుఁగఁ గోరు ప్రభువు. సత్య ధర్మబద్ధుఁడు. రామరాజ్యమును స్థాపించి సార్థకము జేసిన రారాజు.

శ్రీరామచంద్రుఁడు ప్రజలను చల్లఁగా నేలుచుండెను. బ్రహ్మ శ్రీరామాదుల నవతారము చాలింపు మని యమునితోఁ జెప్పియంపెను. యముఁడు యతి వేషమున శ్రీరామునితో "రహస్యము లాడవలయు. మనమేకాంతమున నున్నపుడటకెవరు రాకూడదు. అటుల వచ్చిన వారిని చంపు నటులఁ బ్రతినబూనిన నాసందేశము జెప్పుదున"నియెను. శ్రీరాముఁ డందుల కంగీకరించి, యట్లే ప్రతిజ్ఞ బూనెను. తరువాత నిజరూపమున యముఁడు బ్రహ్మ పుత్తెంచిన విషయము నివేదించెను.

ఇంతలో దుర్వాసుఁడు వచ్చుట, లోకరక్షణార్థము దుర్వాసుని శాపమున కోడి లక్ష్మణుఁడు ఏకాంతమున నున్నరామునిఁజూచి మునిరాకను దెల్పుట జరిగినవి. ఇట నుండి మనము శోకమూర్తి యగు శ్రీరామమూర్తిని జూచుచున్నాము. అడుగులకు మడుగులొత్తు తమ్ముఁడు, అన్నకొఱకై యన్నిసౌఖ్యములఁ ద్యజించిన తమ్ముఁడు, అడవిలోఁ బదునాలుగేండ్లు నిద్రాహారములుమాని సేవసల్పిన తమ్ముఁడు, చిన్ననాఁటఁగోలె దనతో మెలఁగిన ననుఁగుఁ దమ్ముఁడు, ఇట్టి తమ్ముని నేఁడొక్క ప్రతినకొఱకై అన్న చేజేతులఁ జంపింపవలయును, చంపుటెట్లు? శోకబాష్పాకులితుఁడై యేమి చేయుటకుఁ దోఁచక సభాసదుల యభిప్రాయ మడిగినాఁడు. ప్రజాభిప్రాయమునకుఁ గట్టువడిన ప్రభువు శ్రీరాముఁడు. అందుచే సర్వమును వారి కెఱింగించినాఁడు, వారికిని తోఁడు నీడ లేరా? వారేమి చెప్పఁగలరు?

కడకు వసిష్ఠుఁడు లేచినాఁడు. రాజనీతి ధర్మములు చెప్పినాఁడు. "ప్రతిజ్ఞాపాలనము సర్వదా శ్రేయము. మనరాజులందఱు ప్రతిజ్ఞాపాలకులు. ప్రతిన దొలఁగిన నబద్ధమాడినటులగును. అసత్యముచే ధర్మము హతమగును, ధర్మములేనిచో జగములు నశించు. పెక్కులోకములు నశించుకంటె నొక్క తమ్ముఁడెక్కువా? అన్నియు ననిత్యములు. సత్యమొక్కటే నిత్యము. రామా! సత్యపాలనము కొఱకే గదా నీతండ్రి నిన్ను అడవులకుఁ బంపెను. కాన సత్యముచేఁ గీర్తినొందుము"

గురుమునిజనభక్తుఁడైన శ్రీరామునికి ధర్మములన్నియు నాచరణీయములనియే తోఁచినవి. దుర్వాసమునియెడల భక్తిచేతనే దుఃఖమును దిగమ్రింగి యాతని నిష్టమృష్టాన్నములఁ దృప్తి గావించెను. సత్యమన్న శ్రీరామునకుఁ బ్రాణము. అన్ని ధర్మములతదెఱిఁగినవే. కాని యీనాఁడతని హృదయ మన్నింటికంటెఁ దమ్ముని యందే లగ్నమైనది. వారి యన్నదమ్ముల సరాగమట్టిది. కాని యేమి చేయఁగలడు? రాజధర్మముల నుల్లంఘించలేని ప్రభువుగదా! ఒక మధ్య మార్గమును వెదకినాఁడు. లక్ష్మణునెటకేని వెడలి పొమ్మన్నాఁడు. సెబాస్! ఎంత మంచిమార్గము. శ్రీరాముఁడు రాజధర్మముల మీరలేదు. తానొనర్చిన ప్రతిజ్ఞను పాలించినాఁడు. తమ్ముని చంపినాఁడను కళంకమును సంపాదింప లేదు. అతని ప్రాణరక్షణకు మార్గమును జూపినాఁడు. కాని పై సుగుణములలో నన్నికేమాత్రమును దీసిపోవని తమ్ముఁడు, లక్ష్మణుఁ డాత్మత్యాగము జేసినాఁడు!

ఈ భారతదేశమున రామరాజ్యమును స్థాపించినవాఁడు శ్రీరాముఁడు. ఆత్మత్యాగ మెట్టిదో చూపినవాఁడు లక్ష్మణుఁడు. ఆ యన్నదమ్ముల సుగుణములు మనకావశ్యమను సరణీయములు!



## సందర్భసహితవ్యాఖ్యలు

### 1. పెక్కండ్రు మడియుకంటె నరయ నొక్కని చావు మేలు. — 4ప.

ఈవాక్యముత్తరరామాయణములోనిది. శ్రీరాముఁడేకాంతముగ మునివేషధారి యగు యమునితో రహస్యవిషయములు మాట్లాడుచుండెను. ఆసమయమున నెవ్వరు లోపల రాకూడదు; వచ్చిన వాఁడెవఁడైనను చంపఁబడవలసినదే యనిరామునిచే యముఁడు ప్రతిన గావించెను. లక్ష్మణుఁడు ద్వారము కడఁగావలి యుండెను. అట్టి యశుభ కాలమున దుర్వాసుఁడు రామదర్శనమున కేతెంచెను. లక్ష్మణుఁడు వినయముతో లోపలకుఁ బోరాదతని విన్నవించెను. కాని సహజకోపియగు దుర్వాసుఁడెగిరి "నన్నడ్డగించుటకు త్రిమూర్తులకే శక్తిలేదు. నీవెంత? నారాకను రాజునకుఁ దెల్పనిచో హితబాంధవ మంత్రులతో మిమ్మందఱిని దగ్ధులగు నటుల శపింతునని గర్జించెను. ఆ మాటలకు లక్ష్మణుఁడీ వాక్యమును దన మనస్సులోఁ దలంచెను.

లక్ష్మణుఁడే బ్రతుకఁగోరిన మునిశాపమున కెందఱు హతులగుదురో కదా! కాఁబట్టి యనేకులు చచ్చుటకంటె తానొకఁడు చనిపోవుటే మేలని భావము.

### 2. కటిక మనంబుతోడ నవకార్యము లిట్టివి యాచరింతురే?— 8ప.

ఈవాక్యము కంకంటి పాపరాజ కృతమగు నుత్తరరామాయణములోనిది. దుర్వాసువిరాకను లక్ష్మణుఁ డన్నకెఱిఁగించెను. దుర్వాసుఁడు సంతృప్తిగా భుజించిపోయెను. కాని రామునికిది గొప్ప యాపదఁ దెచ్చి పెట్టెను. శ్రీరాముఁడు యమునితో నొనర్చిన ప్రతిజ్ఞను బట్టి లక్ష్మణుఁడు మృతుఁడు గావలయు. దుర్భరచింతాక్రాంతుఁడై "అయ్యో! ఈకాలుఁడేల వచ్చెను? ఈమహాప్రతిజ్ఞను నేనేలఁ బూనితి? సుజనాత్ముఁడైన నాయనుఁగు దమ్ముని(బాసి నేనెట్లుండగలను? ఈవెడమాట లెట్లు నోరాడి యాడఁగలను?" అని దుఃఖించు సందర్భములోనివీ మాటలు!

దయలేని గుండెతో విట్టి చెడ్డపను లెవ్వరైన చేయుదురా? చేయరని భావము.

3. ఇట్టి దమ్ముని బ్రతినకై యెట్లు నొంతు? — 9ప.

4. ఏమి సేయుదుఁ దుది దైవ మెంత సేసె? — 9ప.

జవాబు 2 వ దాని వలె.

5. ఎవ్వారికిఁ గాలముఁగా గడవ వచ్చునె? — 13 ప.

ఈ వాక్యము కంకంటి ఉత్తరరామాయణము లోనిది. శ్రీరాముఁడు దానొనర్చిన ప్రతినచే లక్ష్మణుని జంపించు దారుణ పరిస్థితి యేర్పడినది. ప్రియసోదరుని యెడఁబాయలేక రాముఁడు శోకబాష్పాకులితనేత్రుఁడై యతని సుగుణములు దలఁచి తలఁచి పొగిలెను. లక్ష్మణా! ఇందులకేనా నన్ను నమ్మి కొలిచితివని యేడ్వ లక్ష్మణుండన్న ననునయించు సందర్భములోనిదీ వాక్యము. "నన్ను గుఱించి చింతింపకుము. కోవిదులు ఆపదలలోఁ గలఁత నొందుదురా?" అని పల్కెను.

ఎవరికిఁగాని లోకమున తమతమ విధిని దాఁటఁ దరముగాదు. ఏకాలమున నేది రావలెనో యది వచ్చునని భావము.

6. కోవిదు లాపదలఁగా గలంగరు. — 13 ప.

7. స్వకుల ధర్మము మానుదురే నరాధిపుల్? — 13 ప.

జవాబు 5వ దానివలెనే.

8. లోకతతులు వెక్కు నాశమగుకంటె నహోదరుఁ డొక్కఁడెక్కుఁడే? — 17 ప.

ఈవాక్యము కంకంటి ఉత్తరరామాయణము లోనిది. ఒకానొక ప్రతినను బట్టి శ్రీరాముఁడు లక్ష్మణుని జంపింపవలెను. సత్యధర్మనిరతుఁడైన శ్రీరామునికిది జటిల సమస్యయైనది. తన్ను నమ్మి తనకెంతయో సేవ యొనర్చిన యనుఁగుఁదమ్ము నెట్లు

చంపఁగలఁడు? రామునకి దిక్కేఁదోఁచక సభాసదులకీయుదంతముజెప్పి హితము దెల్పుఁడని యడిగెను. సభ్యులెవ్వరికేమియుఁ దట్టలేదు. వసిష్ఠుఁడు "రాజా! నీకు ప్రతిజ్ఞాపాలనమే యవసరము. తమ్మునికొఱకు ధర్మము వీడరాదు. అట్లొనర్చిన నసత్యమాడినట్లగు. అసత్యమున ధర్మము, నధర్మమున లోకతతులు నాశమగు నను సందర్భమున నీవాక్యమును జెప్పెను.

లోకములన్నియు రాముఁడబద్ధమాడిన నశించును. ఈలోకములకంటె తమ్ముఁడెక్కువగాదు. కాన లోక హితార్థమై తమ్ముని త్యజించుటే యుత్తమ మని భావము.

9. సకల మనిత్య మెప్పటికి; సత్యము నిత్యము — 18 ప.

జవాబు 8వ ప్రశ్నవలె.

ఈక్రింది పద్యముల ప్రతిపదార్థములు, భావములు ముఖ్యములు.

2, 18, 22.

---

# మొల్లరామాయణము.

## హనుమంతుఁడు సీతాదేవిని దర్శించుట.

1. పావని(వ్య)పవనుని(వాయుదేవుని)కుమారుఁడగు నాంజనేయుఁడు, అప్పుడు, పావన.... పేతన్, పావన—పవిత్రమైన. విఖ్యాత — ప్రసిద్ధి జెందిన. సుగుణ—సద్గుణముల యొక్క. భావ+ఉపేతన్—తలపుఁలతోకూడిన దానిని. సేవిత—సేవించుచున్న. దనుజవ్రాతన్—రాక్షసుల గుంపుగల దానిని. భూవనితాజాతన్—భూమాత కుమార్తెయగు దానిని. నిత్య—ఎల్లప్పుడును, పూతన్—పవిత్రమైన దానిని. సీతన్—సీతను. కనుగొనెన్—చూచెను, అలం—అంత్యానుప్రాసము,

2, ఆరామన్ —ఆవనితను. శింశుపావృక్షంబు—అశోక మను చెట్టు.

3. వేఁగి—తపించి. లోఁగి—అణఁగి. తొరఁగు—కారుచున్న. తోఁగి—మునిఁగి, అలం—లాటానుప్రాసము,

4. సీత+అపహృత, హృదయుఁడు—సీతచే నపహరింపఁ బడిన మనస్సుగల వాఁడై (సీతను కామించిన వాఁడై), మజ్జనము — స్నానము. అంబరంబులు—గుడ్డలు. సమ్మిళితంబు—కలసినది. మవ్వంపుతావి—మనోహరమైన వాసన, నివ్వటి

క్లైదు—కలిగెదు(ఒప్పు). మెత్తి—పూసి. మకుటంబులు_కిరీటములు. మణిమండితంబులు—మణులతో నలంకరింపఁ బడిన—(పొదుగఁబడిన). కుండలంబులు—చెవుల యాభరణములు. భాను—సూర్యునియొక్క. ప్రభా—కాంతితో సమముగ. విలసితంబులు—ప్రకాశించునవి. ముక్తాహారంబులు— ముత్యాలపేటలు. అంగుళీయకములు—ఉంగరములు. స్థగితంబు—చెక్కఁబడినది. చంద్రహాసము—కత్తి. కందర్ప—మన్మధునియొక్క. విలాస—శృంగార భావములచే. సుందరుండు—అందగాఁడు. అమర—దేవతలయొక్క. ఉరగ—నాగులయొక్క. అంగనలు—స్త్రీలు. ఆలవట్టంబులు—ఉత్సవపు గొడుగులు. ఛత్రంబులు—గొడుగులు. తాలవృంతములు—తాటి విసనకఱ్ఱలు. కరదీపికాసహస్రంబులు—వేయి చేతి దివ్వియలు. పిఱుంద—వెనుక. ఏతేర (రూ) ఏగుదేర. ఆరామంబు—ఉద్యానము. గంధవాతూలము—మంచి వాసనల గాలి. హస్త—చేతుల చేతను. ఉరువస్త్ర—శ్రేష్ఠమగు చీరలతోను. కేశ—వెంట్రుకలతోను వరుసగా. మాటియు—మఱుఁగుపఱచియు. కప్పియు. అడంచియు—అణఁగునట్లొర్చియు. క్రమాలంకారము. ధూసరము—బూడిద రంగు గలది. మేఘ+ఛన్నంబు—మబ్బులచేఁ గప్పఁబడినది. డంబున—రీతిగా. కుందనంపు శలాక—బంగారు తీఁగ. పోలె, కైవడి, డంబున, లాగున—ఈవాక్యములలో ఉపమాలంకారము.

5. ఆతత—విరివియైన. నయవాక్య—నేర్పైన మాటల యొక్క. ఫణితిఁ—మార్గమున. చేతస్+భవ—మన్మధుని యొక్క. నిశిత—వాడియైన. అంబక—బాణముల యొక్క. వాతంబులఁ—పడుటలు చేత. నొచ్చి—బాధపడి.

6. తోయజ దళ+అక్షి—నీటి యందు పుట్టిన తామర రేకుల వంటి కన్నులు గల దానా. వలపు+రాయఁడు—ప్రేమకు రాజు (మన్మధుఁడు). పటుసాయకములు—తీక్ష్ణమైన బాణములు. ఏర్చి—కూర్చి. తోయద పథంబున—మేఘ మార్గమున (ఆకసమున). అమేయరుచి—అశక్య మగు కాంతి. ఉడురాయఁడు—నక్షత్రముల రాజు (చంద్రుఁడు). వడఁ కాయంగఁ—వేసంగిలోని వెగ యెండ కాయఁగా. కీరములు—చిలుకలు. అళివ్రజము—తుమ్మెదల గుంపు. లత+అంగీ—తీఁగ వంటి మృదువైన శరీరము గల దానా. అలం: అతిశయోక్తి.

8. అలక+ఈశ్వరుండు_అలక అను నగరమునకు పతి కుబేరుఁడు. ఉపాయనముగ—బహుమతిగ. చీనిచీన+అంబరములు—ప్రశస్త మగు చీనాదేశమందలి పట్టు వస్త్రములు. దివిజ+అధినాధుండు—దేవేంద్రుఁడు. ఉల్లసత్—ప్రసవములు—ప్రకాశించు పూలు; పూవు(పర్యా) స్త్రియః సుమనసః పుష్పంప్రసూనం కుసుమం సుమమ్-అమ దక్షిణ+అధీశుండు—యముఁడు. సురభి—మురయను వాసన ద్రవ్యము. అడియాస—వచ్చు నను ఆశ.

9. వీటికి—వీడునకు (నగరమునకు). ఏడువారాసులు—ఏడు సముద్రములు:-

"లవణేక్షు సురా సర్పి దధి క్షీర మహార్ణవాః"-అమ. పెచ్చుపెరుగు — ఎక్కువగు భండారము — ధనాగారము. నవనిధానంబులన్ — తొమ్మిది విధము లగు ధనరాశులతో. నవ నిధులు: — "మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకర కచ్ఛపౌ। ముకుందః కుంద నీలౌచ వరశ్చ నిధయో నవ."-అమ.

10. శ్వసనుండు — వాయుదేవుఁడు. సమ్మార్జనము — ఊడ్చుట. అబ్ధినాథుఁడు — వరుణుఁడు. పావకుండు — అగ్ని. శమనుండు — యముఁడు. పాక + అరి — ఇంద్రుఁడు. కల్పక ప్రకరంబులు — కల్పవృక్షముల సముదాయములు. దనుజ + ఈశ్వరుండు — నైఋతి. కైదండ — చేయూఁత. నరవాహనుఁడు — కుబేరుఁడు. ఈశానుఁడు — శివుఁడు గురుఁడు — బృహస్పతి. పరవిన్ — క్రమముతో.

11. శంకర + అచలము — కైలాసపర్వతము. మొత్తితి — నలుగఁ గొట్టితిని ఒత్తితి — నొక్కితిని (బాధించితిని). త్రెళ్ళకన్ — చచ్చునట్లుగ. భోగివరములు — నాగ రాజుల కుత్తుకలు. అలం: దీపకము.

రావణుఁడు కైలాసమెత్తుట :— విశ్రవసునికి కైకసికి జనించిన వాఁడు రావణుఁడు. ఇతఁడు సోదరులతోఁ గలసి బ్రహ్మను గూర్చి తప మొనర్చి గొప్ప వరములఁ బడసెను. గర్వంబున గన్ను గానక యతఁడొనర్చిన దురంతములకు అంతులేదు. నిండు జవ్వనమున నొక సారి కైలాసమును బెకలింపఁ బోయి కాలరుద్రుని కాలివ్రేలఁ దగుల్కొని గిజగిజ లాడి శృంగభంగము గావింపఁ బడెను.

12. దుర్గమ్ములు — వనపర్వతప్రవాహాదు లందు కష్టముగ నుండు త్రోవలు అలం: కావ్యలింగము. 13. జలధి — సంద్రము. లావు — బలము. వారిజము — తామర పూవు. అలం: విషమము. 14. మను — బ్రదుకు. దానవులు — రక్కసులు. అలం: కావ్యలింగము.

15. నగధరుఁడో — విష్ణువో. నగధన్వుఁడో — శివుఁడో. నగభేదియో — పర్వతములఁ గూల్చిన వాఁడగు ఇంద్రుఁడో.

16. నాకస్త్రీలు — దేవలోకమందలి వనితలు 17. సూటింపకన్ — సరిపడు నట్లుగా. ప్రతి — ఈడు.

18. లోలాక్షులన్ — చలించు కన్నులు గల స్త్రీలను. మత్త + ఇభ. కుంభస్తనీ — మదించిన యేనుఁగ యొక్క కుంభ స్థలముల వంటి కుచములు గల దానా. అలం: వ్యతిరేకము.

19. వ్రీడ — సిగ్గు. ఉడిగి — వదలి. మృదు + ఉక్తుల్ — మెత్తని మాటలు. సుదతీ — సుందర మగు పలు వరుస గల దానా. 20. మచ్చున — విధమున.

22, 24. పరదార — ఇతరుని పెండ్లము. న్యాయము — ధర్మము. అలం; నిదర్శనము.

25. సంగరరంగము — యుద్ధభూమి. మాతంగ — ఏనుఁగులయొక్కయు.తురంగ — గుఱ్ఱములయొక్కయు. శతాంగి — రథముల యొక్కయు.

విరాధుఁడు :— సీతారామలక్ష్మణులరణ్యమున చిత్రకూటము దాఁటిపోవుచుండిరి ఆసమయమున విరాధుఁడను రక్కసుఁడు సీత నెత్తుకొని గగనమార్గమున కెగిరెను. వెంటనే శ్రీరాముఁడు వానిని జంపి గరుడాస్త్రమున సీతను భద్రముగా నేలకుఁ జేర్చెను.

ఖరుఁడు:— శూర్పణఖను లక్ష్మణుఁడు ముక్కుచెవులు ఖండించెను. ఆమె యేడ్చుచు ఖరదూషణాది సోదరుల కీవిషయమును చెప్పె ఖరుఁడు పదునాల్గువేల రాక్షస సైన్యమున శ్రీరామునిపైఁ గవిసెను ఘోరయుద్ధము జరిగెను. శ్రీరామచంద్రుఁడు సైన్యము హతము జేసి ఖరుని శిరమును ద్రుంచెను. వెంటనే దూషణుఁడు విజృంభింప వాని మూఁడు తలలను ఖండించెను.

26. కూకటి — పిల్లజుట్టు. దైత్యులు — రక్కసులు. రజమునన్ — దుమ్ముచే. ఈపద్యమున తాటకవధ, విశ్వామిత్ర యజ్ఞసంరక్షణము, శివధనుర్భంగము, ఖరదూషణ వధ, అహల్యాశాపవిముక్తి, మారీచవధ అను రామాయణ ముఖ్యఘట్టములు పేర్కొనబడినవి.

27. పొంకము — పొందిక. చేవ (రూపా) చేగ — గర్వము, సారము.

28. ఆలాపములు — సంభాషణలు. పారావారమున్ — సంద్రమును. కట్టి — వంతెన కట్టి. ఘోర+ఆజిన్ — భయంకరమగు పోరులో. కోటీరయుక్తంబుగాన్ — కిరీటముతో కలసి. మస్తముల్ (రూ) మస్తకముల్ — తలలు. భుక్తుల్ — భోజనములు. భూత+ఆళికిన్ — పిశాచముల గుంపునకు.

తా|| రావణా! వీరాలాపములు పల్కనేల? సమస్తమును విశదముగా విను. రాఘవుఁడు సముద్రమును గట్టి కోపమున నిన్ను భయంకర యుద్ధమున గవియును. తన బల సంపదతోఁ క్రూరాస్త్రముల నీ తలలు కిరీటములతో నఱకి పిశాచతండమునకు భోజనములు పెట్టును.

29. ఆరూఢ... విధిన్, ఆరూఢ — ప్రసిద్ధమగు,ప్రతిమాన — ఈడగునట్టి,విక్రమ — పరాక్రమమనెడి. కళా — విద్యయొక్క, అహంకార — కోపముయొక్క, తేజస్+నిధిన్ — కాంతికి తావైనవానిని. శ్రీరామున్, సుగుణ+అభిరామున్ — మంచిగుణములచే నొప్పు వానిని. తెగడన్ — నిందింప. చేకొన్న — పూనుకొనిన. నిన్ను. ఆజిలో — యుద్ధములో. దారన్ — తన భార్యను. దొంగిలితి (వి)+అంచు. నిష్ఠురగతిన్ — కఠినముగా. దండించి. ఖండింపన్ — నఱకుటకు. మున్నీరు — సంద్రమును. ఎట్లు+ఐవను. అలుకన్

కోపముతో. నేఁడు+ఎల్లి – ఈదినమో, తేపో. దాఁట వచ్చు. శాంతింపుమా.

తా॥ ప్రసిద్ధ మగు పరాక్రమ కళాతేజోనిధియును, సుగుణాభిరాముఁడునునగు శ్రీరాముని నిందింపఁ బూని నావు. తన భార్యను దొంగలించితి వని కోపమున నిన్ను కఠిన ముగా యుద్ధమున శిక్షింప సముద్రము నెట్లయిన దాఁటి వచ్చును. కాన నేఁడు తేపు కొంత శాంతింపుమా.

30. చీరికి – లేశమునకు. ఒడుపు – పట్టు. కాల+అహి – నల్ల త్రాచుపాము.
31. అఁటది – అఁడుది. 32. కుయ్యాడక – మొఱపెట్టక, అలం: లోకోక్తి.
33. ఆకాంక్ష – కోరిక. భావజకేళిగా – మన్మథ క్రీడ యందు.

34. రాక+ఇందు+బింబ+అననా – పున్నమ చంద్రుని బింబము వంటి మొగము గలదానా. భీమ... మహిమగా; భీమ – భయంకరమైన. అటోప – విజృంభణము చేయు. భుజ – భుజము యొక్క. ప్రతాప – శౌర్యముయొక్క . మహిమగా – గొప్పదనముచే. భీమ+అచలంబు+ఎత్తి – భయంకరమైన పర్వతము నెత్తి, సుత్రామ – దేవేంద్రుఁడు, ఆది – మొదలగు, దిక్+ఈశ -- దిక్పాలకుల యొక్క. సైన్యముల. సంగ్రామంబులోగా – పోరులో. ఓర్చి – జయించి. ఉద్దామ – గంభీరమగు, ప్రౌఢిగా -- నేర్పుతో. వెలంగుచు+ఉండెడు – ప్రకాశించు చుండెడు. కళాధాముండ – కళలకు (విద్యలకు) స్థానమైన వాఁడును లేక కళలచే వెలుఁగువాఁడును. నాముందటన్. రాముగా. గీముని. చెప్పగా గిప్పగావగరా.

తా॥ పున్నమ చంద్రుఁ బోలు మోముగల కాంతా! భయంకరమైన నాభుజబలప్రతాపముజే మున్ను భయానకములగు కొండల నెత్తి కొట్టితిని. దేవేంద్రాది దిక్పాలకుల యుద్ధమున జయించితిని. గంభీరమగు నేర్పుతో ప్రకాశించు కళాధాముఁడను. అట్టి నా ముందఁ రాముఁడా? గీముఁడా! వాని పేరు చెప్ప గిప్ప నిచ్చుట నవ్వరా? అని రావణుఁడు సీతతోఁ గోపమున బల్కెను.

35. మంజువాణీ—మనోహరమై నవాక్కులు గల దానా. హేలను—తిరస్కారముతో. వేల్పుమూకలచే — దేవతల గుంపుచేత. వెట్టి — ప్రతిఫలము. కూలి లేక నిరంకుశలకు పేదలు చేయు చాకిరి. గణములతో—శివుని సహచరబృందములతో పనజగర్భుని చేత—బ్రహ్మ చేత. ఈపద్యమున రావణుని దుండగములు. ఖ్యాతచరిత్ర విశద మగు చున్నవి.

36. పేద—బలహీనమైన. ఒడ్డి—అడ్డముంచి. శిత —వాడియైన. కఠారధార—కత్తివాదర. 37. జంకించి—భయపడఁ జేసి.

38. సురవరుఁడో—దేవేంద్రుఁడో. ధనంజయుఁడో—అగ్నియో. సూర్యతనూజుఁడో—యముఁడో. యాతుధానుఁడో—నైఋతియో. శరధివిభుండో—సముద్రనాథుఁడైన వరుణుఁడో. పురశాసనమిత్రుఁడో—త్రిపురాసురులను రక్షించిన శివుని చెలికాఁడైన

కుబేరుఁడో, భోగిభూషుఁడో — సర్పములను భూషణములుగాఁ గల శివుఁడో. అలం: సంధేహము. 39. గాటపు జంకెనయే — ఎక్కువైన బెదరింపే. కరవాలునకు — కత్తికి.

40. పంకరుహ+అక్షిల — బురదలోఁ బుట్టిన పద్మదళములవంటి కన్నులు గల వారి యొక్క. వైదేహిక — విదేహ రాజతనయ యగు సీతకు.

41. కడికండలుగఁ — (కండ+కండ) — ముక్కలు ముక్కలుగ. కోసుక, ఎత్తుక (60) — ఇట్టి పదములు వ్యాకరణ సమ్మతములు గావు. కోసికొని, ఎత్తికొని — సరియైన రూపములు. పలలంబు — మాంసము.

42. అరుణిత+ఎఱ్ఱనైన. భీషణ — భయంకరమైన.

44. గంధవహు పుత్త్రుఁడు — వాయువు కుమారుఁడైన హనుమంతుఁడు. లంఘించి — దుమికి. సత్త్వము — బలము. తూలి — తగ్గి. బలువిడి — బలము లేక. అడఁగిన — నశించిన. తెగుము — మరణించుము. తెఱఁగు — విధానము.

45. దివిజ+అరి — దేవతల శత్రువు (రావణుఁడు). ధామము — ఇల్లు.

46. యామినీచర కామినులు — రాత్రించరు లగు రక్కస వనితలు.

47 ఝంఝత్ — ప్రకాశించు. రత్న — రత్నములతోఁ బొదిగిన. కోటీరముల్ — కిరీటములు. కలనఁ — యుద్ధమునందు. ఉద్వహుండు — పేరు గలవాఁడు. గంధద్విపంబు — మదించిన ఏనుఁగు. 48. శుద్ధాంతపు దేవి — అంతఃపురము నందలి రాణి.

51. ఇమ్ముగ — సుఖముగ. 54. ఒడికము+ఔ — అందమగు.

56 ఈవు+ఇయ్యంగను — నీవు ఇచ్చుటకును. శ్రీరఘుపుంగవుఁడు — రఘువంశమున శ్రేష్ఠుఁడైన శ్రీరాముఁడు.

57. ముద్రిక — ఉంగరము. కువలయ+ఈక్షణ — నల్లగలువల వంటి కన్నులు గలది. వల్లభు చందము — పతి యొక్క తీరు.

59. విస్ఫుట ఫణితిఁ — చక్కగాఁ దెలియు విధమున.

60. దాఁగురించి — మోసము జేసి. హేమవిభూషణ+అవళులఁ — బంగారునగల సముదాయమును. తామరస+ఆత్మనందనుఁడు — తామరలకు మిత్రుఁడైన సూర్యుని పుత్త్రుఁడగు సుగ్రీవుఁడు.

61. అర్కసంభవునకు — సూర్యపుత్త్రుఁ డగు సుగ్రీవునకు.

వాలిసుగ్రీవులు:-సుగ్రీవుని అన్న వాలి. వాలి మహా బల శాలియై కిష్కింధ నేలుచుండెను. ఒకసారి దుందుభి యను రక్కసునకును వాలికిని పోరయ్యెను. వారిరువు రొక బిలము బ్రవేశించిరి. చాల సేపటికి రక్తధార బిల నుండి బయఁటకు తిమ్మ పడి గాంచి

సుగ్రీవుఁడు భయపడి వాలి ధని పోయెనేమో యని పెద్ద బండ నాబిలద్వారమున కప్పు వైచి నగరమునకు పాటి పోయెను. దుందుభిని జంపిన వాలి యెట్టులో బిలము దాఁటి, కిష్కింధకు వచ్చెను. తన రాజ్యము నపహరింప నిట్లు మోసగించె నని వాలి కోపగించి తమ్ముని నగరము నుండి వెడలఁ గొట్టెను. ఇదియే వాలిసుగ్రీవ కలహ కారణము. సుగ్రీవుఁడు హనుమంతుఁడను మంత్రితో ఋశ్యమూకపర్వతమును జేరెను.

దుందుభి:–ఇతఁడు మాయావి కొడుకు. హిమవంతుని రణమునకు రమ్మని బిలువ నతఁడు వాలి కడకుఁ బొమ్మనెను. మధువనమున వాలి దుందుభులకి భయంకర యుద్ధము జరిగెను. వాలి దుందుభిని జంపి పైకి విసరెను. ఆశవము ఋశ్యమూకాద్రిని దపమొనరుచు కొనుచున్న మతంగముని పైఁబడెను. అతఁడు వాలి నా పర్వతమునకు వచ్చిన చచ్చునట్లు శపించెను. అందుచే సుగ్రీవున కాపర్వతమే శరణ్యమైనది.

ఏడు తాడులు:–సుగ్రీవుఁడు శ్రీరామునితో సఖ్యము జేసి యతనికి సాయముజేయ మాట నిచ్చెను. వాలి నుండి తన్ను రక్షింప వేడెను. వాలి మహాబలశాలి గాన రాముని బలమెఱుంగఁ గోరినపుఁడు సప్త తాళముల నొక్క బాణమున తెగ వేసెను. ఇప్పుడే రాముఁడు దుందుభి కళేబరమును గూడఁ బదియోజనముల దూర మెగురఁ జిమ్మెను.

తాళ్లు–తాడులు — తాటిచెట్లు.

62. శంపునకా — అనట్లిచే. వార్ధిన్ — సంద్రమున్. శాఖిపథమువన్ — చెట్టుమీఁద.

64. ధవళ+అబ్జము — తెల్లతామర. కంబుసన్నిభము — శంఖముతో పాటి యగు నది. గుల్ఫము — చీలమండ. యుగంబులు — జంటలు. పీనవక్షము — బలసినయెద. అలం పర్యాయోక్తము. 65. ఉరుతర — మిక్కిలి శ్రేష్ఠమైన 66. కుశేశయ నయన — తామర వంటి కన్నులు గలది. 67. ధీవిధి — ధైర్యశాలి. 69 అంబరవీధిన్ — ఆకాశ మార్గమునందు.

71. రవికులవార్ధిచంద్రుఁడు — సూర్యకుల మను సముద్రమునకు చంద్రుని వంటి వాఁడు. పర్వసమయము అందు సూర్య చంద్రుల గతి ననుసరించి సముద్రమున నలలు ఆటుపోటులు చూపును. చంద్రుఁడు క్షీరసాగర మథన సమయమున సముద్రమున జనించె నని పురాణములు వ్యాఖ్యానము. సూర్యచంద్రులు సముద్రుని బిడ్డల వలె పోల్చుట కవి సమయము. బ్రహ్మకల్పములో కాలమానమున బ్రహ్మ దినములు. 71 మహాయుగములు = 1 మన్వంతరము. 14 మన్వంతరములు = 1 బ్రహ్మదినము. జ్యోతిష గ్రంథములఁ బట్టి 864,0000,000మానవ సంవత్సరములు.

74. కాఱులు — పరుషమైన మాటలు. 75. నెటివేణి — అందమైన జడ. జీర్ణ+అంబరము — చినిఁగిన గుడ్డ. ఒలియన్ — చుట్టి. నిరా+అశనస్థితి — ఆహారముతీసికొనని స్థితి. తారకబ్రహ్మమంత్రము — తారక మనెడి("రామ")పరమాత్మను గూర్చిన మంత్రము. గహనసీమన్ — అరణ్యప్రాంతము నందు. అలం: స్వభావోక్తి.

80. ఇనుఁడు — సూర్యుఁడు. వననిధిన్ — సముద్రమును. 81. నెగడవు — లభించవు. బుధనుత చరితా — జ్ఞానముచే స్తుతింపఁ దగిన నడవడిక గలవాఁడా.

85. బలబృందముతో — సైన్యసమూహముతో. ఆజిలోన్ — యుద్ధమునందు. రాజసము — రజోగుణము వలన గల్గినది. త్రిగుణములు:-సత్వము, రజస్సు, తమస్సు.

## కావ్యవిమర్శ.

కవయిత్రి:- మొల్లరామాయణమును మొల్ల యను కవయిత్రి రచించినది. ఈమె నెల్లూరి మండలమునకుఁ జెందిన దని స్థూలముగఁ దెలియునే కాని జీవితవివరము లంతఁగా దెలియవు. ఈమె వంశాదికముల నీమె తండ్రి యాతుకూరి కేసయ యని మాత్రము గ్రంథపీఠికలో వ్రాసికొన్నది. తక్కిన వివరములు గాన రావు. ఈమె కవితిక్కన శిష్యురాలనియు, తెనాలి రామకృష్ణుని సమకాలికురాలనియుఁ గొన్ని కట్టు కథలలోఁ బ్రచారమున్నది. కాని వానిని నమ్మఁ దగిన ప్రమాణములు లేవు. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహకర్త శ్రీకృష్ణదేవరాయల సమకాలికురాలేమో యని సందేహముగఁ దెల్పినాఁడు. ఈమె తన రామాయణమున గవిస్తుతిలో శ్రీనాథుని వఱకుఁ గల కవులనే పేర్కొన్నందున నీమె శ్రీనాథునకు దిమ్మట (పదునైదవశతాబ్దము) నుండి యుండ వచ్చును.

ఈమె గోపవరపు శ్రీకంఠమల్లేశువరము చేతఁ గవిత్వము నేర్చుకొంటి ననియు గుడలింగజంగమార్చనపరుఁడగు నాతుకూరి కేసయ వరపుత్రి ననియుఁ జెప్పికొన్నందున నీమె శైవమతమునకుఁ జెందిన దని చెప్ప వచ్చును. కాని వైష్ణవపరమగు రామాయణమును వ్రాసి తన మతసహనమును జాటెను.

కావ్యము:- ఉత్తరరామాయణ కావ్యవిమర్శనలోని భాగమును జర్చవు కొనుఁడు. ఈమెయు రామాయణమును "వేదమైన దోఁచ కున్న వెట్టినె చెప్పిరా", "దైవమైన రఘురాము నుతింపినఁ దప్పు గల్గునే?" యని రామాయణప్రాశస్త్యమును ఘనముగఁ గొండాడినది.

కవిత:- మొల్ల గూఢశబ్దములతోఁ గావ్య మల్లరా దనియుఁ, గందువ మాటలతో సుందరముగ, వీనులవిందుగాఁ గవిత నల్ల వలయు నను నభిమతము గలది. ఈ క్రింది పద్యములలో నామె దెలుఁగు కవిత రూపురేఖలఁ దెల్లము జేసినది.

"తేనె సోఁక నోరు తీయన యగు రీతి
తోడ నర్థ మెల్లఁ దోఁచ కుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యము
మూఁగ చెవిటి వారి ముచ్చటగును.

కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మది కానుపించు విబుధుల మదికిన్

మొల్లరామాయణము సరళశైలిలో సుదికారపు సొంపు నింపుల వెలయు చున్నది. శబ్దాలంకారములతో మధురమంజులమార్దవధారావిలసిత మైనది. ఈమె కవిత్రయము, పోతన శ్రీనాథాది పూర్వకవులగ్రంథముల జీర్ణించు కొని, వారి పోకడలతోఁ దన కావ్యమున మెఱుఁగులు దిద్దు కొనెను. ఉదాహరణమునకు 1 "సురవరుఁడో ధనంజయుఁడో .. .... 2 నీలమేఘచ్ఛాయఁ బోలు దేహము వాఁడు ........మొల్ల.రా.సుం.కా. అను పద్యములు పోతనను జ్ఞప్తికి దెచ్చును. రావణుఁడు సీతకు తన గొప్పదనమును జెప్పు సందర్భము లోని

"ఎవ్వాని వీఁటికి నేడు వారాసులు పెట్టని కోటలై పెచ్చు పెరుగు......... అను పద్యము తిక్కన విరాటపర్వము లోని ధర్మరాజును వర్ణించు.

"ఎవ్వని వాఁకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు......

నను పద్యమునకు నచ్చు పోత వలె దిగినది. ఇట్లని కేవల మీమెకవిత యనుకరణ మన రాదు. మొల్లరామాయణము చిన్న కావ్య మైనను పురుషులు వ్రాసిన పెక్కు రామాయణముల కన్నను మిన్నగ నున్నది.

## కథాసారాంశము.

హనుమంతుఁ డశోకవనమున సీతను గుర్తించెను. అశోకవృక్షము మీఁద సూక్ష్మ రూపమున నుండెను. కామోద్రేకుడైన రావణుఁడు సీతను గవయఁ గోరి యామెను దుర్భాష లాడెను; రాముని నిందించెను. సీత యా మాటలకు రోసి తీవ్ర మైన జవాబు చెప్పెను. అందులకు దశకంఠుడు మిక్కిలి కోపించి యామెను జంపఁ జంద్రహాసమును దూసెను. ఆసమయమున గొందఱు సుందరాంగనలు రావణుని వారించిరి. రెండు నెలలలో సీత నెట్లయిన నొడంబఱచుఁ డని రాక్షసకామినులకుఁ జెప్పి రావణుఁడు వెడలి పోయెను. తరువాత రక్కసపడతిత లలసి నిద్రించిరి. త్రిజట శ్రీరాముఁ డేతెంచి రావణుని జంపి సీతను గొనిపోవు చున్నటుల కలగనెను. ఆవిషయ మందఱికిఁజెప్పి యామె సీత నోదార్చెను.

ఆసిమ్మట నందఱు నిదురింప హనుమంతుఁడు చెట్టు దిగి వచ్చి, శ్రీరాముని యుంగర మిచ్చి సీతకు తన్నెఱింగించు కొనెను. సీత నమ్మ లేదు. కాని శ్రీరామవృత్తాంతము సర్వము నివేదించెను. తన నిజస్వరూపమును జూపెను. అప్పుడు జానకి హనుమంతుని నమ్మి

తన యుంగరము నానవాలుగ నిచ్చినది. తన్ను మన్నింపు మని లక్ష్మణునకుఁ జెప్పు మని నది. ఆమె దీవన నంది తప్పక శ్రీరామునితో త్వరలో వచ్చెద మని చెప్పి హనుమంతుఁడు తిరిగి పోయెను.

## ప్రశ్నోత్తరములు

1. సీతతో రావణుఁడు పల్కిన దుష్టభాషణము లెట్టివి? రావణుఁ డేవిధమున దన్ను దాను పొగడు కొనెను?

హనుమంతుఁడు లంకకు జని సీతను గుర్తించి అశోకవృక్షము మీఁద సూక్ష్మరూపమున నుండెను. ఆసమయమున రావణుఁడు సీతపై మోహము గొని పన్నీట స్నానమాడి, దివ్యాంబరాభరణభూషితుఁడై రాజదర్పమున సీత కడ కఱుదెంచెను. మన్మథబాణ పీడితుఁడై యీ విధమున బ్రేలఁ జొచ్చెను.

లతాంగీ! మన్మథుఁడు నన్ను శరములతోఁ గొట్టు చున్నాఁడు. చంద్రుఁడు సెగ యెండలు గాయఁ దొడఁగెను. కోయిలలు; చిల్కలు, తుమ్మెదలు మ్రోయుచున్నవి. నీవు మాత్రము నన్ననుగ్రహింపవు. ఇది న్యాయమా? కుబేరుఁ డంపిన చీని చీనాంబరములు, దేవేంద్రుఁ డిచ్చు పారిజాతప్రసూనములు, యముఁ డంపిన సుగంధములు, ఆదిశేషుఁ డంపిన యాభరణములు మాయింట మిక్కుటముగఁ గలవు. ఈ భోగములతో నాతో కామకేళి సుఖముల ననుభవింపుము. రామునిపైనడియాస వదలుము.

తరుణీ! ఎవని లంకకు ఏడు సంద్రములు పెట్టనికోటలో ననుదిన మెవని నింద్రాది దేవతలు సేవింతురో, ఎవని చెఱసాలలో గంధర్వకాంత లుందురో, ఎవని ధనాగారమున నవనిధులు విలసిల్లునో యట్టిరావణుఁడ నేను. పుష్పకవిమాన మెక్కి తిరుగుశక్తి నాకే కలదు. నాభుజాశక్తికిఁ బ్రతి లేదు. నాకు భయపడి వాయు వూడ్చును. వరుణుఁడు కలయంపి సల్లును; అగ్ని వంటలు సేయును; యముఁడు పరిచర్య లొనరించు; ఇంద్రుఁడు కల్పకముల నిచ్చును; నైఋతికై దండ లొసఁగు; కుబేరుఁడు మానగరికి వెచ్చ మిచ్చును. శివుఁ డైశ్వర్యము నిచ్చును. బృహస్పతి పంచాంగము జదువును. అమరకిన్నరాదివనితలు కొలువ వైభవమునమందును. కైలాసము నెత్తి బంతి వలె మోత్తినాఁడను. దిక్పాలకుల గర్వము పీడఁ దఱిమితిని. శత్రురాజుల జంపితిని.

సఖీ! జడలు ధరించి ఋషుల వలె వడవులలో దమ్మునితో గూరగాయలు గూడుగాఁ గుడుచు రాముఁడేవిధమున లంకకు రాఁగలఁడు? మహాసముద్రము నింకఁజేయ నేరడు తాఁద లేరు. వారధియూ కట్ట లేరు. ఆ నరులకు సముద్రము దాఁటు బలము లేదు. వారి

సాక్షి: ఇంక వారు వచ్చు టెట్లు చెప్పుమా? దానవులము మానవభక్షకులము. కాన మానవు లను మేము గెలువఁ గలము. రాక్షసుల గెలువ నరుల తరమగునా? మీరాజు నాకెదురట? ఇది యెవ రైన విన్న నవ్వి పోరా? ఆ రాముఁడు విష్ణువో? శివుఁడో? ఇంద్రుఁడో? నాతోఁ గొంత కొంతకుఁ బోరాడుటకు.

కాంతా: నీ కన్నులు, నీ కుచములు, నీ ముఖకాంతు లమరకాంతలకును లేవు. సురయక్షకిన్నరాదిలోలాక్షులు అందమున నీతో సరి రారు. మత్తేభకుంభస్తనీ! సిగ్గే యలం కారముగా, భయము వీడి నాతో సరసాలాడుమా. బేడిసల నేలు కన్నులతో నన్ను జూడుమా! "అని మోహాంధకారమున కన్ను గానక యున్మాదుని వలె దుర్భాష లాడెను.

## 2. సీత తృణంబు ద్వారా రావణునితోఁ బల్కిన వీరా లాపము లెట్టివి? దుర్భాష లాడిన రావణుని సీత యెట్లు మందలించినది?

రావణుఁ డాడు దుర్భాషలకు సీత క్రుంగిపోయినది. ఒడలు మండి పోయినది. రోషంబున నొక గడ్డి పఱకను చేఁబట్టి రావణునితో నిట్లనినది.

పతినే దైవముగా నెప్పుడు తలఁచుచున్న కాంతలఁజెఱుపఁ బ్రతిన గల వాఁడవీవు. అట్టి నీతో బదులు మాట లాడుట కంటె వేఱు పాప మున్నదా? ఇతరుల భార్యల నపే క్షించు దుర్మతుల కాయువు నశించును. పుణ్యమూ చెడును. సజ్జనుల నిందించిన నరకమున బడుదు రను నీతిని విన లేదా? తన సాహసమును దానే పొగడు కొను వాఁడు హీనుఁ డని నీకుఁ దెలియును. అట్టిచో నిన్ను నీవే పొగడు కొంటివి. నీతి దప్పిన నీ దుర్భాషలు విన రానివి.

నీవు శౌర్యవంతుఁడై నచో చతురంగబలముతో సంగరరంగమున నిలువ శక్తి లేక నన్ను దొంగిలించి తెచ్చినావేల? విరాధుఁడు ఖరుడుఁ మున్నగు నీ వారి పాటు జూచియు నీకు బుద్ధి లేక పోయెను. ఇప్పుడీ తుచ్ఛపుఁ బల్కులు బల్క న్యాయమా?

శ్రీరాముఁడు కేవలము మానవుఁడు, రాజమాత్రుఁడుగాదు. పిల్ల జుట్టు ముడి వేయ లేని లేఁబ్రాయముననే తాటకను జంపెను. విశ్వామిత్రుని యాగసంరక్షణసమయమున మీ రాక్షసుల పెక్కండ్ర సమయించెను. రారాజులు బ్రేలం జూప లేని హరధనుస్సును విఱి చెను. వనవాస కాలమున ఖరదూషణాదిదనుజుల హతము గావించెను. కాలి దుమ్ముచే జాతి బండ నొక కాంతగా మార్చెను. మాయామృగమును గూలనేసెను. అతఁడు లోకరక్ష కుఁడైన నారాయణుఁడు. అట్టి శ్రీరామభూపాలునకు నీ లంక యెంత? నీ రక్కసుల పొంత యెంత? నీ వెంత? నీ బలమెంత? మాట లేల? నీవే చూచెదవు గాక!

రావణా! వీరాలాపము లాడనేల? రాఘవుఁడు తప్పక పారావారము గట్టి రాఁగలఁడు. కోపస్ఫూర్తితో నిన్ను సమరమున డీకొనఁ గలడు. తనశక్తిసంపదతో నీ పదితలలను

కిరీటములతో నేలఁ ద్రోసి పిశాచముల కాహారములు పెట్టఁగలఁడు. ప్రసిద్ధమగు పరాక్రమ కళాహంకార తేజోనిధియును, సుగుణాభిరాముఁడును నగు శ్రీరాముని నిందింపఁ బూనితివి. తన భార్యను దొంగిలించితి వను కోపమున కఠినముగా సమరమున నిన్ను శిక్షింప సముద్రము నెట్లయిన దాఁటి వచ్చును. కాన నేఁడు తేపు కొంత శాంతింపుమా" యని సీత వీరాలాపములు బల్కి దుష్టాత్ముఁడగు రావణుని మందలించినది.

3. హత్య గావింపఁ బూనిన రావణుని బారినుండి సీత యే విధమున గాపాడఁ బడెను?
రావణుని బారినుండి సీత నెవరే విధమున రక్షించిరి?

రావణుఁడు కామోద్రేకుఁడై సీతను దన్ను బొందు మని దుర్భాషలాడెను. అందుకా సతీమతల్లి భయపడక శ్రీరాముని పరాక్రమాదులఁ దెల్పుచు పరదారలఁ గవయఁ గోరుట మహా పాపమని బుద్ధి చెప్పెను. దుర్మార్గుఁడు, నిరంకుశుఁడగురావణుని కామాటము గోపమును గల్గించెను. తన్నొక స్త్రీ చీరికిగొనక వీరాలాపము లాడుటయా? ఒడుపు తప్పిన నల్లత్రాచు వలె మహారోషమున మండిపడి యీవిధమున సీతను భయపెట్టఁ జొచ్చెను.

ఆఁడుదానవని దయ జూడ నన్నే ధిక్కరింతువా? మాటలాడకుండ నీ నాలుక తూఁటులుగాఁ జేయకున్న దోషము నాదేగదా! నాకుల్లోబడి మొఱపెట్టు కొనక నాతో ఢీకొనికయ్యానికిఁ గాలు దువ్వఁ గడగినది. అందఱు చూచుచుండ దీనిని చీలికలుగా చీల్చి దయ్యాలకు బలిపెట్టెదను. బలిమితోఁ బైకొని కోరిక దీర రమింపక వదలిపెట్టిన గర్వముతో నిట్టులే నవ్వుముకాని నన్ను గైకొనునా?

రాకేందుబింబాననా! భయంకరమైన నాభుజబల ప్రతాపమున ముందు భీతినిగొల్పు పర్వతముల నెత్తి కొట్టితిని. గొప్ప నేర్పుతో ప్రకాశించు వాఁడను. అట్టి నా ముందట రాముఁడా? గీముఁడా? వాని పేరు చెప్ప గిప్ప నిచట నవ్వరా? పుష్పక విమానమెక్కి సర్వలోకము నాయాజ్ఞతో నిల్పి చుట్టితిని. దేవతలచేత వెట్టి చాకిరి చేయించితిని. పూబంతివలె శివగణములతోఁ గైలాసమెత్తివైచితిని. ఉగ్రతపమొనర్చి బ్రహ్మచే వరములు సంపాదించితిని. గంధర్వాది కాంతలను చెఱ పట్టితి. ఇట్టిసామర్థ్యము నాయొక్కనికి గాక భూలోకమున నెవరికైన నేనాఁడైన గలదా? ఒక బలహీనుఁడగు నరుని నన్నెదిరింప నొర్డి భయములేక యిట్లు దుర్భాష లాడుచున్నది. నాయీ నిశిత ఖడ్గమున దీని నాలుకను మొదలంట కోసి పాఱవైచెదను.

అని కన్నుగానని కోపమున జంద్రహాసమున జళిపించి లేవనెంచెను. అంతలో గొందఱు ప్రియసుందరు లడ్డము నొచ్చి రావణు నిట్లనునయించిరి. "మహారాజా! ఈమె యబల. మీరు కోపించుటకీమె సురపతుఁడా? ధనంజయుఁడా? లేక మఱే దిక్పాలుఁడా? ఈ

తరుణిపై నీవు ప్రతాపము జూపకు. ఈమెను దారుణమృగహత్య గావింపఁ దగునా? మీ రిట్లు కోపించు టేల? కత్తికీవనిత యర్థమగునా? మమ్ములను మన్నించి యీ మాటకిమెను గావుము". ఈవిధముగా శాంతవచనములఁ బ్రియములు పలుకు నా సుందరాంగుల విన్నప ములు మన్నించి, సీతకు గావలిఁగాయు ఏకజట, ద్విజట, త్రిజట, దుర్ముఖి, వాయుముఖి, శూర్పణఖ మున్నగు రాక్షస స్త్రీలను జూచి యిట్లనియె.

రెండు నెలలు గడువిచ్చితిని ఈ లోపల మీనేర్చినటుల సీత నొడఁబఱుపుఁడు. అది యిష్ట పడనిచో దాని కండలుకోసి తినుఁడని పలికి రోషారుణితనేత్రుఁడై తిరిగి నగరికేఁ గెను, పైవిధమున గొందఱు సుందరాంగనలు సీతను రాముని బారినుండి రక్షించిరి.

## 4. హనుమంతుఁడు సీతను దర్శించిన వృత్తాంతమును దెల్పుఁడు? సీత హనుమంతులు పరస్పరము తమ్మెటుల గుర్తించుకొనిరి?

అశోక వృక్షము క్రింద ననవరతము "రామా. రామా!" యని పలుకు చున్న సతీ రత్నమును హనుమంతుఁడు సీత యని తలంచెను సూక్ష్మరూపమున నా చెట్టుమీఁద నెక్కి గూర్చుండెను. ఇంతలో దుర్మగుఁడ రావణుఁడట కఱుదెంచెను. నోటవచింపరాని ములుకుల వంటి పలుకుల మోహాంధుఁడై సీతను నొప్పించెను. సీతయా దుర్భాషలకు రోసి, "పతినే దైవముగా నెంచు పతివ్రతలఁ జెఱుపనెంచు నీతో బదులాడుటకంటెఁ బాప మున్నదా? పరదారాపేక్షచే ఆయువు నశించును. సత్పురుషులదూషింప నరకమను నీతి నెఱుఁగవా? నీసాహసముల నీవే తెల్పుకొంటివి. కాని యంత వీరుడవు నన్నేల దొంగి లిచ్చి తెచ్చితివి? నీవీరాలాపములేల? శ్రీరామచంద్రమూర్తి మహావీరుఁడు తప్పక లంకకు రాఁగలఁడు." అని సీత వానివి లెక్కఁ జేయక వీరవాక్యము లాడెను.

ఆమాటలకు రావణుఁడు ఒడుపు దప్పిన కాలసర్పము వలె మండిపడి జంద్రహాస మును దూసి యామెను నఱుక బోయెను. వెంటనే యచటనున్న గొందఱు ప్రియసుంద రులడ్డు వచ్చి రావణుని యీదారుణ కృత్యమునుంచి తొలఁగించిరి. మంచి మాటలచే వాని కోపమును జల్లార్చిరి. సీత మనసు మార్చుకొనుటకు రెండు నెలలు గడువొసగెను. అం తకును నొడంబడనిచో నామె కండలఁగోసి భక్షింపుడని శూర్పణఖాది రక్కసులకుఁ గట్టడి జేసి రావణుఁడు తన నగరి కేఁగెను. సీత తన పరాభవమును, దుస్థితిని భర్తృనిం దను తలంచి గోడున నేడ్చుచుండెను. సహజసంతాపమున తోడి యమర కాంతలు సీత వెంట నేడ్చిరి. ఆమగువల పరిదేవనకు ప్రకృతియే పరితపించు నట్లుండెను.

అన్నియు నాలోకించు చున్న హనుమంతుఁడాగ్రహమున "ఇప్పుడే రావణుని చం పుదునా? ఒకవేళ నేనీ రక్కసుని చేతిలోఁ బడిన నక్కడ సీతను గానక రామలక్ష్మణులు

క్రుంగి కృశించుచు, వారిని గన లేక సీతయుఁ బ్రాణము త్యజించు, కాని దశకంఠునిఁపై దెగించుట కిది యదనుగాదు. సీతకు నాదు రాక తెల్పి, రామభద్రుభద్రములు చెప్పవలెను. ఆ మీఁద రావణవధఁజూతమ"ని కొంచెముశాంతించెను. రాక్షసాంగనలు అలసి నిద్రించిరి. అం దుత్రిజటయను నిశాచరి "శ్రీరాముఁడు రావణుని జంపి సీతను గొనిపోవుటను గల గంటిని. ఇవి సీతకు శుభసూచకములు. కాన నీకోపులి నేవియుఁ గతినోక్తులాడకుఁడు. ఈ దేవియేమన కు రక్ష" యని, సీతను గాంచి "అమ్మా భయపడకుము. నీ మగఁడు నిన్ను గొని పోవును. కరుణతో మమ్ము రక్షింపు" మని చెప్పెను. కొంత తడవునకు మరల రాక్షసాంగనలు నిద్రించిరి.

ఇదే సమయమని హనుమంతుఁడు "ఉన్నాఁడు రాముఁడు లెప్పగా. నినుగొని పోవఁద్వరలో రానున్నాఁడమ్మా"యనియనఁగ నచ్చెరువున సీత పైన జూచెను. కాని రావ ణుని మాయలనినమ్మ లేదు. ఈ భావమూహించి హనుమానుఁడు క్రిందికి లంఘించి, విం దుభక్తితో రామభద్రుని సర్వవృత్తాంత మెఱింగించెను. కడపట రాముఁడంపిన యానవాలు ఉంగరమును భూమిజ కిచ్చెను. దానినిగాంచగనే సీతకుఁ గొంత నమ్మకము దొరికినది కాని వివరముగ "నీవిషయము, మా రామచంద్రుని సంగతి దెల్పిచో నిను నమ్మ లేననెను. అందులకు మారుతి శ్రీరామసుగ్రీవస్నేహము, వాలివధ, సీతాన్వేషణము మున్నగు వృత్తాంతములఁ బూసగ్రుచ్చి నటుల విన్నవించెను. శ్రీరామచంద్రుని రూపురేఖ లను వర్ణించెను.

అప్పటికిని సీత "నమ్మ నా యుంగరమిడాఁలను. నీనిజరూపము జూపుమా" యన హనుమానుఁ డంబరవీధి వఱకు బెరిగి బ్రహ్మాండస్వరూపమును జూపెను. సీత కిపుడు పూర్తి నమ్మకము గుదిరినది. "మహోపకారమొనర్చితివి. నీమేలు మఱువను. బ్రహ్మకల్ప ములు వర్థిల్లుము. నాయీదుర్భర వేదనమును శ్రీరామచంద్రునకుఁ దెల్పుము. నీతి వారగుఁ డైన లక్ష్మణుని "యవివేకముచే నిందించి తత్ఫల మిక్కడనుభవించుచుంటిని. లక్ష్మణుని నన్ను మన్నింపు"మని చెప్పుమనఁగా హనుమంతుఁడిట్లనెను.

"అమ్మా, నావీఁపున గూర్చుండుము. సూర్యోదయములోపల నీభర్త కడకుఁ జేర్చెద ను." కాని సీత "ఇది నీతిగాదు. నన్ను దొంగిలి తెచ్చిన రావణుని యుద్ధమున జంపక వాని వలె దొంగిలి కొనిపోవుట దొరలకుచితముగాదు. అట్లొనర్చిన రాముని రావణుని కన్న పెద్ద దొంగ యందురు. దీనిచే నపయశము గలుగు. కావున నీవు పోయి యిన్నియు నా పతికి విన్నవింపుమన హనుమంతుఁడు వల్లె యని యామెచే దీవనములు బొంది మరలి చనెను.

క్రింది వారి గుణశీలముఁ జర్చించునది.

1. రావణుఁడు. 2. సీత.

## రా వ ణుఁ డు

రావణుఁడు విశ్రవసుని కుమారుఁడు; రాక్షసుడు; అలంకారప్రియుఁడు; పరస్త్రీ లోలుఁడు: నిరంకుశప్రభువు: గర్వాంధుఁడు; కాముకుఁడు. కాన నాఁడువారి యెడ దాక్షిణ్యము జూపువాఁడు; పరులపీడించు దుర్మార్గుఁడు. ప్రస్తుత కథాభాగమును బట్టి రావణుఁడు పై గుణములతో నొప్పుచున్నాఁడు.

సీతయందు కామాసక్తుఁడైన రావణుఁడు పన్నీట స్నానమాడి దివ్యాంబరములు,నవ్య భూషణములు ధరించెను. రాజ దర్పమున సీతప్రోలనిలిచెను. ఒడలు తెలియక నన్ను ప్రేమించుమని విరహతాపమున విన్నవించెను. అలంకరించు కొనిపోయిన జానకి తనపై వలపునిలుపు నను మోహాతిరేకమున నశేషదివ్యాభరణములు ధరించెను.

ఇతఁడు నిరంకుశప్రభువు గాన సర్వనృపతులను, నష్టదిక్పాలురను, దేవతలను జయించెను. వారిచే నూడిగములు చేయించుకొను చుండెను. వాయుదేవుఁడు లంకలో నూడ్చునఁట: అగ్ని పాకములు దయాఁగ చేయునఁట; ఏమి దౌర్జన్యపాలనము; ఇతనికి భయపడి యందఱును లోఁబడి వర్తించెదరు. ఈవిషయములను దన్ను దాను మెచ్చు కొనుచు సీతకుఁ దెల్పెను. "ఎవ్వాని చెఱసాల నేఁప్రొద్దునుందురు గంధర్వ సురయక్ష గరుడ కాంతలు, అమరకిన్నరగంధర్వయక్షభుజగసిద్ధ కింపురుషాంగనల్ చేరికొలువ"— ఈపలుకులనుండి రావణుఁడేవిధమున పరస్త్రీలోలుఁడో మనకు బోధపడఁ గలదు.

చిన్నతనముననే బ్రహ్మచే వరములు బొంది గర్వాంధుడై కన్ను మిన్ను గానకుండెను. అందుచే తనప్రతాపమును సీతతో "ఎత్తితి శంకరాచలము.........మొదలగు పద్యములలో తెగ పొగడు కొనెను. ఇతని దృష్టికి శ్రీరాముఁడడవిని దవసి వలెనుండు బలహీనుఁడు. కూరగాయలు దినువాడేఁరీతి లంకకు రాఁగలఁడని పరిహసించెను. జలధిదాఁటు లావు చాలదఁట నరులకు. అందుచే రాముఁడు లంకకెట్లువచ్చు చెపుమ వారిజాక్షి? యని సవాలు జేసినాఁడు. దానవుఁడైన రావణుని మానవమాత్రుఁడగు రాముఁడు గెలువ లేఁడట! ఏమి గర్వము! ఏమియహంకారమో చూడుఁడు.

సీతను గామింపఁగోరి యసహ్యాభాషణము లాడెను. రాముని పరిహసించెను. సీత పతి నిందకు రోసి రావణుని గోపమున మందలించినది. అప్పుడు రావణుఁడుగ్రకోపమున సీతను నఱుక ఖడ్గము నెత్తెను. ఇంతలో నచటనున్న కొందఱు సుందరాంగులడ్డు దగిలి యామెను చంప వలదని శాంత వచనముల బ్రతిమాలిరి. ఆకోపమెటులఁబోయెనో రావణుఁడెత్తిన కత్తిని దించెను. సీతను జిక్కఁబెట్టుటకు రెండు నెలలు గడువిచ్చెను. మఱియు సీతను గూర్చి రావణుఁడు "అటదిగాయని కూరిమి పాటించిన" యని వాకొన్నాఁడు. ఈసందర్భములను బట్టి కామాసక్తుండు గాన రావణునికిఁ బ్రత్యేకముగా స్త్రీలయెడఁ గొంత పక్షపాతము గలదని దెలియు చున్నది.

రావణుని యాసురకృత్యములనంతములు; అత్యంత ఘోరములు. అతని జీవిత మంతయు పరపీడాసక్తమై యుండెను. "ఎత్తితి శంకరాచలము.........భీమాటోప.... అఖిల లోకముల నాయాజ్ఞ నిల్పితి......మన్నగు పద్యసారాంశమీవిషయమును ఋజువు చేయును. ఈవిధమున రాక్షసేశ్వరుడైన రావణుఁడు లోకకంటకుఁడై యొప్పెను.

## సీత.

సీత మహాపతివ్రత; అవతారమూర్తి, చల్లని ప్రభువగు శ్రీరామ పత్ని; ఆదర్శ ప్రాయురాలగు భారతీయవనిత; పతినింద కోర్వనిసతి; ప్రతివిషయమును జక్కఁగా పరీక్షించినగాని దేలికగ నమ్మదు; కష్టములనోర్చు యిల్లాలు; తన తప్పునకు పశ్చాత్తాప పడు వనిత. సకల ధర్మముల నెఱింగిన సాధ్వి. ఆపదలందైనను ఋజు మార్గమున జరింప నిచ్చగలది. ధీరురాలు.

రావణుఁడు సీతను కామించినాఁడు. తన్ను బొందుమని బహు విధముల బ్రతిమాలినాఁడు; బలపరాక్రములఁ బ్రకటించినాఁడు; నఱికెదనని కత్తినెత్తి జళిపించి నాఁడు; కండలుగాఁగోసి తినుఁడని రాక్షసాంగనలతోఁజెప్పి బెదరించినాఁడు. ఈయదరింపులకు బెదరింపులకు మహాపతివ్రత, ధీరురాలగు సీత కించిత్తుకూడ భయపడలేదు. పతినిందకు రోసి రావణుని గోపమున మందలించినది. రాక్షసులమధ్య తన్ను జంప కత్తి నెత్తినను భయపడలేదు. నిర్లక్ష్యసూచనగా గడ్డిపఱకను చేఁబూని జవాబు చెప్పినది. శ్రీరాముని గొప్పదనమును విశదము జేసినది. ఇవి యన్నియు నీమె ధీరత్వమును, పతిభక్తిని జాటును.

పతితోడి జీవితమే సతికి సంభావ్యమని భర్తతోనరణ్యమున కేఁగినది. రావణుఁడు చెఱబట్టి రేయింబవళ్లు "రామః రామః" యని పతి ధ్యానముననే ప్రాణములు పెట్టుకొన్నదిఁ, ఆమె విడుదపెన్నెఱివేణి జడలు గట్టినది, వస్త్రము చినిఁగిపోయినది. ఆమె కిప్పుడు దుమ్మే మైపూఁత, భూమియే శయ్య. తారకబ్రహ్మమంత్రమే జపము. రావణున్నికామె జెప్పిన మాటలు రతనాల మూటలు. "పతివ్రతలఁ జెఱపె నెంచు నీతో మాటలాడుటే మహాపాపము. పరులభార్యలఁగోరిన వారికాయువు నశించును. సజ్జనుల దూషింప పుణ్యము చెడును. నరకము తప్పదు. తన సాహసకృత్యముల, గొప్పలఁదానే పొగడుకొనరాదు. నీతిరహితమైన మాటలు వినరాదు." ఇవి జానకీదేవి చరిత్రకుదాహరణములు.

హనుమంతుఁడు తన్ను వీఁపుపై నెక్కించుకొని శ్రీరామునికడఁ జేర్చెదనని చెప్పఁగా సీత యీవిధమున బలికినది. "రావణుఁడు దొంగయై నన్ను గొనివచ్చినాఁడు ఇప్పుడు నీవును ఆ దొంగపని చేసెదవా? ఈపని నీవు చేసిన రావణునికంటె రాముఁడే దొంగ యందురు. దొంగిలి కొనిపోవుట దొరలకుఁదగునా?" ఇట్టి ధర్మములు భారతీయాదర్శములు. ఇందుచే సీత ఆదర్శ ప్రాయురాలగు భారతీయ వనిత.

అరణ్యవాసమున నెన్నోకష్టములఁ బడినది రావణుని యొద్ద నామెపడిన కష్టము లలవిగానివి. దినదినగండములు. ఎన్నియో మాయలతో రావణుఁడామెను జెఱుప నెంచి యున్నాఁడు. ఈకష్టసముద్రమున నామె మునుఁగుచుఁదేలుచు నున్నది. హనుమంతుఁడామెక్షేమమును గోరువాఁడు; రామభక్తుఁడు. అతఁడు తనవిషయమును, శ్రీరామలక్ష్మణోదంతమును జెప్పినను గూడ సీత వానిని నమ్మలేదు. ఏలనన నామె యను దినము రాక్షసమాయలఁగాంచుచున్నది. ఇదియు రావణచర్యయే మోనని యామె సందియము. కడకు హనుమంతుని నిజస్వరూపమును బరీక్షించినగాని యామె వానిని నమ్మలేదు. నమ్మి తన యుంగరమాన వాలుగా నీయలేదు. ఇందుచే నామె ప్రతివిషయమును జక్కఁగా బరీక్షించినగాని నమ్మదని తెలియుచున్నది. ఇంత జాగ్రత్తగా నున్నందుననే యామె తన సతీత్వమును సంరక్షించు కొనఁగల్గినది.

సీత బంగారులేడిని బట్టఁబోయిన భర్త విషయమై యాందోళనముతో లక్ష్మణుని కఠినముగా మాటలాడినది. ఆపాపమునకుఁ దన్ను క్షమింపుమని ప్రత్యేకముగా లక్ష్మణునితోఁ జెప్పుమన్నది. తనతప్పునకుఁదానే పశ్చాత్తాప పడినది. ఈఘట్టమున సీత మన హృదయముల గరఁగించును. ఆమె రాక్షసులమధ్య మహాపదలోనున్నను రావణునకు ఋజుమార్గములఁ జూపినది. బంగారమును గాల్చుకొలది వన్నె హెచ్చునట్లు బాధలఁబడు సీత సతీత్వము మిక్కిలి ప్రకాశించినది.

సందర్భ సహిత వ్యాఖ్యలు:——

1. విడువు మడియాస రామభూవిభుని మీఁద——8ప.

ఈవాక్యము మొల్లరామాయణములోనిది. రావణుఁడు కామాంధకారమున నొకనాఁడు సీత కడకేతెంచెను. "మన్మథుఁడు నన్ను బాధించుచున్నాఁడు, వెన్నెలయెండ యైనది. నన్ను గృపతో నేలుకొమ్ము. నాకష్టదిక్పాలకు లూడిగము సేయుదురు. అష్టైశ్వర్యములున్నవి. మోహమలర నాతో కాముకేళి గావించి సుఖమనుభవించుట మంచిది. అంతేగాని రాముని మీఁది యడియాస యేలఁ?" యని దుర్భాషలాడెను.

అడియాస యన వచ్చునదియాశ.

2. వైభవంబున జెలు వొందువాఁడఁ దరుణి——10ప.

జవాబు పైదాని మాదిరియే.

### 3. రాముఁడేరీతి లంకకు రాఁగలండు?—12ప.

మొదటి దాని జవాబుతో దీనిని జేర్చుము. రామలక్ష్మణులు మునులవలె నడవులలో దిరుగు చుందురు. వారికాహారము కూరగాయలే, అట్టి వారెటుల లంకకు రాఁగలరు? రాలేరని భావము.

### 4. దానవులను గెలువ నరుల తరమే జగతిన్?—14ప.

మొదటిదాని జవాబు దీనిని వ్రాయుము. రాక్షసులు నరులను గెలువఁగలరు. నరుల భక్షించు రక్కసుల నరులుగెల్వలేరు. నరుఁడైన రాముఁడు లంకకు రాఁగలఁడా? నన్ను జంపఁగలఁడా యని భావము.

### 5. పరదారాపేక్షకులగు పురుషుల కాయువు నశించును.—22ప.

ఈ వాక్యము మొల్లరామాయణములోనిది. రావణుఁడు సీతను కామించి దుర్భాషలాడినందుకు రోసి సీతపై విధమున బల్కెను. పతినేదైవముగా నెంచు సతుల జెలువ నెంచు వాఁడవు. నీతో బదులాడుటే పాపము. ఇతరుల భార్యలఁగోరు వాని కాయువు నశించును; పుణ్యము చెడును. సత్పురుషుల నిందింప నరకము వచ్చును. ఈవిషయము నీవు విన లేదా? యని బుద్ధి చెప్పినది.

### 6. సిద్ధంబీమాట వేదసిద్ధాంతముగాన్ —48ప.

ఈ వాక్యము మొల్లరామాయణములోనిది. రావణుఁడు సీతను పొందగోరెను. దుర్భాషలాడెను. సీత రోసి బదులు బుద్ధిచెప్ప రావణుఁడుగ్రుఁడై కత్తి దూసెను. కాని కొందఱు సుందరాంగులు వారించిరి. తరువాత రెండు నెలలలో నామెనొడంబఱచుఁడని వెడలి పోయెను అంత నందఱలసి కనుమూసిరి. త్రిజట కొక స్వప్నము వచ్చెను. రాముఁడు రావణుని చంపి సీతను గొంపోవుచున్నట్లు కలగనెను. ఆమె మేలుకొని యీ విషయమచటి సఖులతో చెప్పు సంధర్భములోనిదీవాక్యము.

వేదమందఱిచేత నమ్మదగినంత ప్రామాణ్యమును బొందియున్నవి. ఆవేదమువలె పైవిషయమును దప్పక జరుగునని భావము.

### 7. నేనా రత్నంబు నమ్మి నీకీయఁ, జుమీ?—67ప.

మొల్లరామాయణము నందలిదీవాక్యము. రావణుఁడు వెడలిన వెనుక రాక్షసాంగనలు నిద్రించిరి. ఆదేయదనని హనుమంతుఁడు సీతకడకు దిగి వచ్చెను. సీత నమ్మనటుల నుంగరము జూపి, శ్రీరాము వృత్తాంతమును విన్నవించెను. కాని సీత పూర్తిగ వానిని నమ్మలేదు. ఏలన రావణమాయ యేమోనని సందేహము. ఆసందర్భమున "నీ విజయాపము చూడనిదే నా యుంగరమును గుఱుతుగా నీకియ" నని జానకి పల్కినది.

8. పతికి దయ పుట్టఁగా విన్నపంబుసేయు. —74ప.

మొల్లరామాయణములోనిదీ వాక్యము. హనుమంతుఁడు సీతకు రామోదంతమును దెల్పెను. గుర్తుగా రాముని యుంగరము నిచ్చెను. తన నిజ రూపమును జూపెను. సీత నమ్మినది. వీనులార రామలక్ష్మణుల క్షేమములు విన్నది. తనవిషయములు "రాము నకెఱింగించుమని చెప్పుసందర్భములోనివీ మాటలు. ఆంజనేయా! యిప్పుడే రావణుఁడు వచ్చి నన్నెన్ని కాఱులాడెనో నీవును వినుచుంటివి గదా! ఈ సంగతులనన్నియు నాపతికి నాపై దయపుట్టు నటుల విన్నవించు"మనెను.

9. దొంగిలికొని పోవఁదగునె దొరలకు నెందున్? — 83ప

ఈ మాటలు మొల్లరామాయణము లోనివి. జానకి తనకష్ట గాథను హనుమంతు నితో జెప్పెను. అతని హృదయము కరగి పోయెను. అసందర్భమున "అమ్మా! నీకీబాధ యేల? నావీఁపున గూర్చుండుము. సూర్యోదయములోపల నిన్ను నీపతికడఁ జేర్పఁగలన నెను. ఆ సందర్భమున సీత పైవిధమున బల్కినది. అయ్యా! నీవింతపని జేయఁగలవాఁ డవే. కాని దీనిచే కీర్తిరాదు. రావణుఁడు నన్ను దొంగిలి తెచ్చెను. నీవీకార్యమొనర్చిన రావణుని కంటె రాముని పెద్దదొంగ యందురు. దొంగయగు రావణునిని జంపక నన్ను దొరలగు శ్రీరాములు దొంగిలికొని పోదగునా? యని చెప్పెను.

ఈ క్రింది పద్యముల ప్రతిపదార్థములు, తాత్పర్యములతిముఖ్యములు.

28, 29, 34,

# భా గ వ త ము.

## దశమస్కంధము—పూర్వార్థము.

### శ్రీకృష్ణుఁడు కాలయవనుని జంపుట.

#### అర్థాదులు

1. విశారదుండు-విద్వాంసుఁడు, 2. బాహో_భుజముయొక్క. ఖర్వ-అధమమైన గర్వ+ఉన్నతిన్=గర్వాతిశయముచేత. పవనుండు=గాలి, అభ్రములన్=మేఘము లను. దర్పంబు+గర్వము, అలం: ఉపమ, అంత్యానుప్రాసము. 3. తాదృశుఁడు=అట్టి వాఁడు 5. మేరన్=మర్యాదతో. దో+సామర్థ్యంబున=భుజములనేర్పుతో. అస్మ త్+బాహుశౌర్యంబు=నాయొక్కభుజములయొక్క ప్రతాపము సంగ్రామక్షోణిన్=యు ద్ధభూమిలో. అధ్యుఁడే=అధికుఁడా? 7. నీలజీమూత=కారుమబ్బులతో. సన్నిభ=సా టియగు. తామరస+అభ=తామరలవంటి కాంతిగల. శ్రీవత్స=శ్రీవత్సమనుమచ్చ.

యొక్క. లాంఛన = గుర్తుచే, అంచిత = ఒప్పుచున్న. మహత్ + ఉరము = గొప్పయెద. శ్రీకర = సంపదలుకలుగఁజేయు. పీత = పసుపురంగుగల, కౌశేయచేలము = పట్టు గుడ్డ. అలం: పర్యాయోక్తము, అంత్యానుప్రాసము, తాపస + ఉత్తమా = ఋషిశ్రేష్ఠుఁడా!......

8. కాదన ఘోరన్ — యుద్ధమున జంకను. మత్.........కీలములః మత్ — నాయొక్క. కలహ — జగడమనెడి. కర్కశ — కఠినమైన. బాహు — భుజములందలి. ధనుః+విముక్త — వింటినుండి విడువఁ బడిన. నానా — అనేక. దృఢ — బలమైన. హేమ — బంగారపు. పుంఖ — పింజలుగల. కఠిన — గట్టియగు. జ్వలత్ — మండుచున్న. అస్త్ర — బాణముల యొక్క. పరంపర — వరుసలచే. సమ్+ఉత్పాదిత — పుట్టింపఁబడిన. వహ్ని — అగ్ని యొక్క. కీలముల — జ్వాలలచేత............ అలం:. కావ్యార్థాపత్తి.

తా॥ మునులలో గొప్పవాఁడా! గొల్లవాఁడెంత? ప్రళయాంతకుఁడు వచ్చి యెదురించి నప్పటికిని యుద్ధమాడఁగాదనను. జగడమున నాచేతి ధనుర్బాణములచే విడువఁబడిన బాణాగ్ని జ్వాలల చేత బూడిద చేసెదను.



10. మ్లేచ్ఛులనఁగా ననార్య జాతుల వారని పూర్వుల అభిప్రాయము. 11. ఎల్లి — తేపు, ఎల్లింటి — తేపటి. యవనులు, మాగధులు — అనార్యనృపతులు. 13. వాసవపురి — ఇంద్రనగరము. (అమరావతి) అల: అంత్యానుప్రాసము. 14. మంగళ — శుభయునిచ్చు. సగుణ — సుగుణములచే. సంతర్పిత — తృప్తిపఱచబడిన. గహ్వరికిన్ — భూదేవిగలవానికి గురు — పెద్దదగు. దర్పిత — గర్వించిన. దుఃఖప్రవాహతరికిన్ — శోకమనుప్రవాహమునకు. ఓడ యగు నట్టివానికి. అల: అంత్యానుప్రాసము. 15. నందన — దేవేంద్రుని ఉద్యానవనము. నిర్గమించు — దాఁటిపోవు. పూర్వదిక్+గజము — తూర్పుదిక్కున భూమిని మోయు 'ఐరావతము'ను ఏనుఁగు. గహ్వరము — గుహ. కంఠీరవంబు — సింహము. హరిహయ — ఇంద్రుని యొక్క. దిక్+అంతరాళంబున — దిశయగు తూర్పులో భాగమున. పరిపంథి — శత్రువు (దారిదోపుడు దొంగ) పెంపున, తెఱంగున, కైవడి — అనువదములతో నంత మగు వాక్యములలో ఉపమాలంకారము. 16. తరగ+ఓఘంబుల్ — అలలయొక్కన మూహము. పరిసర్పింపవు — చుట్టిరావు. అసి — కత్తి. ఆయుధ+ఉత్కరము — ఆయుధముల రాశి. శక్రచాప — ఇంద్రధనుస్సుతో. యుత — కూడిన. మేఘస్ఫూర్తితో — మేఘమును పోలిం చుటతో. 17. నిర్+ముక్త+ఆయుధుండు — వదలిన ఆయుధములు గలవాఁడు. నన్ను+ ఓర్వఁగనో — నన్ను ఓడించుటకో. శ్రీన్ — సంపదను. అల: సందేహము. 18. అభిముఖుఁడు+ఐ — ఎదురుగతిరిగిన వాఁడై. ఇభరాజగమనము — గజేంద్రమువంటి తిన్ననినడక. వనజాత+అక్షుఁడు.........20. సింహమధ్యుడు — సింహము వంటి సన్నని నడుము గలవాఁడు. రమావక్షుఁడు — అందమైన (లక్ష్మీయుక్తుఁడు) యెదగలవాఁడు............ అంభోధరదేహుడు — మేఘమువంటి నల్లని శరీరచ్ఛాయ గలవాఁడు.........ఇందుముఖుఁడు — చంద్రునివంటి కాంతిగలమోముగలవాఁడు.........సత్......కుండలుండు; సత్ — మేలైన. వనమాల — తోమాలె. హార — హారములను. కంకణ — కడియములను. సమిద్యత్ — పొదుచున్న (చలించుచున్న) కుండలుండు — అంటుజోళ్ళుకలవాఁడు........ గాఢ+ఉద్ధతిన్ — ఎక్కువ గర్వముతో. అలం: అంత్యానుప్రాసము.

21. చటుల — చలించు. వాల — తోఁకతో. అభీల — భయంకరమైన. సైంహికేయు విభంగి — రాహునివలె. లాలిత — ఇంపగు. ఇతర — వేఱు. జటాలతిక — తీఁగవంటిజడ. తూలన్ = కదలఁగా. ప్రళయ + అవసర = ప్రళయకాలమందలి. బృహత్ = పెద్ద. భాను = సూర్యునియొక్క. హేతిద్యుతిన్ = కిరణముల కాంతివలె, పరుష = కఠినమైన. అరుణ = ఎఱ్ఱని. శ్మశ్రుపటలి = మీసముల సముదాయము. ప్రేలన్ = ప్రేలాడగా. కాదంబి = మేఘ మాలలచే. ఛన్న = కప్పఁబడిన. కాంచనగిరి భాతి = బంగారు కొండ (మేరువు) వలె. కవచసంవృత = కవచముచే చుట్టుకొనఁబడిన. వల్మీక = పుట్టలో సుప్త = నిదురించు. దుర్వార = అడ్డగించుటకు వీలుకాని. అహివైఖరి = పామువలె. కోశంబులో = ఒరలో. వాలు = కత్తి. ఆర్చి = బొబ్బరింతలుగావించి. పేర్చి = విజృంభించి. జగత్ + అవనున్ = లోకమును గాపాడువానిని అలం: ఉపమ, వృత్త్యను ప్రాసము 22. జవరేఖన్ = వేగము యొక్క కాంతితో. దిక్ + తటములు = దిశలయంచులు. 24. సమిత్ + కామంబున = యుద్ధమందలి యాశతో. వీటిన్ బోవఁగా = కళంకమగునట్లు. వెన్ను + ఇచ్చి = వీఁపు జూపి. యుద్ధ భూమిలో వీఁపుజూపినను, పూరిని నోటబట్టినను బలహీనులు, శత్రువులకు లొంగిన వారనియు పూర్వ మర్యాద. వైగుణ్యంబు - చెడుగుణము (అపకీర్తి) 25. మాధవ - లక్ష్మీపతియగు కృష్ణా! బలిదండన్ — పాతాళమందలి బలిచక్రవర్తియొద్ద. అగ్రజన్మ - బ్రాహ్మణుని యొక్క. హాలిక = నాగలియొక్కయు. అశ్వాట + ఆస్పృతుల్ = గుఱ్ఱములపైఁదిరుగువారి రూపములు. అలం: అంత్యానుప్రాసము. 27. ధనుః = వింటియొక్క. గుణలతా = తీఁగెవంటి కొమ్మల యొక్క. ఆహరి = అగుఱ్ఱములయొక్క. రింఖ = కాలిగిట్టలనుండి. ఉద్ధత = పైకెగుర గొట్టఁబడిన. ధూళి = దుమ్ము. వాత + అశితోన్ = గాలిని మెరగాఁగొను కాళియుఁడను పాముతో. శ్రీకృష్ణుఁడు పోరొనర్చి చంపిన రక్కసుల నీపద్యమున బేర్కొనెను. అలం: అంత్యాను ప్రాసము.

కా॥ బాణములా దూఱవు. నావింటి నారీశబ్దములురావు. గుఱ్ఱముల డెక్కల దుమ్ము గప్పదు. అయ్యో! నగుబాట్లకు లోనై పర్వెత్తుచున్నావు. ఇంతవాఁడవు మున్నేవిధముగఁ గాళి యునితో, కేశితో, కువలయాపీడమను నేనుఁగుతో, చాణూరముష్టికులను మల్లురతో, జరాసంధునితో, కంసునితోఁ బోరితివయ్యా!

పాతాళి (కాళియుఁడు) :— శ్రీకృఁష్ణుడు గోపాలురతో ప్రేవల్లె చుట్టు పట్టులఁ బశువులమేపుచుండెను. కాళిందియను మడువున గాళియుఁడను సర్పముండెను. వాని విషముచే ఆమడువున నీరము గ్రోలిన సర్వజీవులు చచ్చుచుండిరి. ఒకనాఁడు గోపాలురు, పశువు లాజలముఁద్రావి మరణింప, శ్రీకృష్ణుఁడు వానిని బ్రతికించెను. పరోపకార పారీణుఁడై యా మడువున దుమికి నాగరాజు పడగలపైనెక్కి నృత్యముచేసి దానిని బాధించెను. కంఠగతప్రాణుఁడై కాళియుఁడు కృష్ణుని శరణుఁజొచ్చి యామడువును వదలి రత్నాకర ద్వీపమునకు వెడలెను.

కేశి :— కంసునియానతిచే గోకులమున నెద్దురూపమున బ్రవేశించిన రాక్షసుఁడు శ్రీ కృష్ణుని జంపఁ బోయి వానిచే మడిసెను.

కరి:— కంసుఁడు కృష్ణుని జంపఁ బూనిన యత్నములన్నియు బూదెపాలయ్యెను. కట్ట కడకు అల్లుండ్రను జూడవలెనని మధురాపురికిఁబిలిపించెను, కృష్ణ బలరాములకుఁ గంసు ని కాపట్యము తెలియును. నగరి మొగసాలఁగువలయాపీడమను నేనుఁగును వీరిని జంపఁ బంపెను. కాని కృష్ణుఁడా యేనుఁగును వధించెను.

మల్లురు:— అదేసమయమున గంసుని దర్బారు ముందు బలరామ కృష్ణులపైఁ జాణూ రముష్టికులను నిద్దఱు మల్లులను మల్లయుద్ధమునకుఁ బంపెను. శ్రీకృష్ణుఁడు సునా యాసముగ వారిని జంపెను.

జరాసంధుఁడు:— మగధరాజగు బృహద్రథుని కొడుకు. సంతతిలేనిరాజునకుఁ జండ కౌశికముని వరమున నిద్దఱు రాణులకు రెండర్థ శరీరభాగములగు పిండములు పుట్టినవి. పాఱవేయఁబడిన యాపిండములు జరయను రక్కసిచేఁ గూర్పఁబడి సజీవుఁడైన జరాసం ధుఁ డుద్భవిల్లెను. ఇతఁడు యుద్ధముల జావని వరముబొంది దుర్మార్గుఁడై రాజన్యుల బా ధించు చుండెను. కంసుఁడితని యల్లుడు. హంస డిభకయవను లితని మిత్రులు. పదునే డుసారులు కృష్ణునిచే నోటువడి పదునెనిమిదవసారి కృష్ణుని యోడించెను. కడపట శ్రీకృ ష్ణుఁడు భీమునిచేఁ జంపించెను.

కంసుఁడు:— కృష్ణుని మేనమామ. మధుర రాజ్యాధిపతి-మహాక్రూరుఁడు. కృష్ణునిచేఁ జంపఁబడెను.

22 అగ్గలంబు = అధికము. అదరి = విజృభించి. కేడించి = తొలఁగి;కికురుపెట్టు = మో సగించు. సరోవరములు = కొలనులు. సవ్య+అపసవ్య. సంచరతన్ = కుడి, ఎడమ పై పుల పోవుటలు. ఇఱముల = మఱుగులందు. తాఱు = దాఁగును (నక్కును). ఎగవంగ న్ = తఱుమగా. జగత్+అవనుఁడు = లోకములఁగాపాడినవాఁడు.

30. అలం : వృత్త్యను ప్రాసము। 31. నగములు = కొండలు. మగిడి = తిరిగి పక్షవిపక్ష = ఆత్మీయులు, శత్రువులు. 33. అలం: విరోధాభాసము, ఉపమ,యమకము. 33. దారిత = చీల్చఁబడిన. శత్రుభవనున్ = విరోధియింటిని గలవానిని. అపార = ఎక్కు వగు. మహత్ = గొప్ప, వేగ = వేగముచే. విజిత = జయింపఁబడిన. పవనున్ = వాయు వును గలవానిని. అలం: అంత్యానుప్రాసము.

35. తమఃపూర్వము = చీఁకటితోనిండినది.

36. పురుష+అధమ = మొగవారిలోనల్పుఁడా. అలముసేయలేక = యుద్ధమొనర్పలేక దుర్లభ = కష్టమగు. కంటకద్రుమ = ముండ్లచెట్లు. అభీల = భయంకరమగు. మహత్ = గొప్ప. శిల = రాళ్ళతో. సహిత = కూడినట్టి. భీకర = భయంకరమగు. కుంజ ర = ఏనుఁగులు. ఖడ్గ, సింహ, శార్దూల. శరభ = సివంగులచే. సంకలిత = కలసిన.

దుర్గపథంబున = పోరానిమార్గమున. ............... సనిద్రుక్రియస్ = నిద్రబోవు వానివలె. చాఁగి = పేలకువ్రాలి.

తా॥ నరాధమా! నాతో పోరలేక యీ కష్టమగు ముండ్లచెట్ల లోపలఁబడి భయానకమగు శిలలతో, గజఖడ్గ సింహ శార్దూల తరక్షులతోఁగూడిన దుర్గమ మార్గమున బర్వెత్తి యీ కొండగుహలలో నిద్రబోవువానివలె నటించిన నిన్ను గడల నియ్యను.

38. కులిశ సదృశము = వజ్రాయుధముతో సమమైన. ప్రతిస్వనంబు = మాఱుసవ్వడి.
39. కమఁదమ్ములు = తామరలవంటికన్నులు. కిన్క = కినుక (కోపము); సాయక = కత్తిచే. ఛిన్న = నఱుకఁబడిన. విరోధి = శత్రువులయొక్క. కంఠవనుస్ = కంఠముంగుం పుగలవానిని ............ .. ......... దృష్టి = చూపులను. సమ్ + ఇద్ధ = మిక్కిలిప్రకాశవంతమగు. విగ్రహ = పోరునందు. ఉత్పన్న = పుట్టినవగు. మహత్ + అగ్నికీలము ల = గొప్ప అగ్నిజ్వాలల చేత అలం: అంత్యానుప్రాసము.

తా॥ యవనుఁడు తన్నఁగా శ్రీకృష్ణుఁడు లేచి నీలిగి కనులు మెల్లనవిచ్చెను. కోపము మెండుగాఁగ దెసలు పరికించి కత్తిచే విరోధుల కంఠమును నఱుకువాఁడు శ్రీభవనుఁడగు యవనుని లేలికగా దన దృష్టిమహాగ్ని జ్వాలలచే భస్మము జేసెను.

## భాగవతము

## శ్రీ కృష్ణుఁడు కాలయవనుని జంపుట.

## కావ్యవిమర్శ.

కవి:- శ్రీకృష్ణుఁడు కాలయవనుని జంపుట అను విషయమాంధ్ర భాగవతము లోనిది. ఈ భాగవతమును దెనిఁగించినది మహాభక్తుఁడైన బమ్మెర పోతన యను కవి చంద్రుఁడు. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; తల్లి లక్కమ; తండ్రి కేసన; కొడుకు మల్లన. ఇతని వాసస్థలము వివాదగ్రస్తమైనది. కొందఱోరుగల్లందురు. మఱికొందఱు కడపమండల మందలి యొంటిమిట్ట యందురు. శ్రీనాథుఁడితని బావమఱదియని జగత్ప్రసిద్ధియేగాని చారిత్రకముగా నిజముగాదు. కాని కొంతవఱకు సమకాలికుఁడనవచ్చును. గోల్కొండ ప్రాంతమున రాచకొండ దుర్గాధిపతియు, వేంకటగిరి రాజులమూల పురుషుఁడును నగు సర్వజ్ఞసింగభూపాలుఁడు (క్రీ. శ. 1422-1447) ఇతని సమకాలికుఁడే. ఇతఁడే భాగవతమును దన కంకితమీలేదని భూమిలోఁ బూడ్పించిన మహానుభావుఁడు. ఇందుచేఁ బోతన బదునైదవ శతాబ్దివాఁడని తేలినది.

ఇతఁడు నిరాడంబరుఁడైన కర్షక కవి. రామభక్తుఁడు. ఒకచేతఁగలము నొకచేత హలమును బూని మందారమకరంద మాధుర్యములగు జ్ఞానరాశుల, ధాన్యరాశులఁబండించినాఁడు, శ్రీనాథ పోతన్నలకు సంబంధించిన గాదలలోని సత్యమెట్టులున్నను వానిచే పోతనకుఁ గల త్యాగము, దైవభక్తి, పాండిత్యము, నిరాడంబరత్వము విశదమగుచున్నవి. ఇతనికి "సహజపాండిత్య" యను బిరుదము గలదు. చిన్ననాఁట బసుల మేపుకొనుచుండఁ జిదానంద యోగి యితనికి రామమంత్ర ముపదేశించెననియుఁ నందుచే నితనికి పాండి

త్యము గల్గెననియుజెప్పుదురు. ఇతఁడు రాజులకుఁ దన కావ్యమంకిత మీనొల్లక వారి యెడ ననాదరముతో నుండెననుటకు—

"ఇమ్మను జేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్నిపుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెట ప్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బొమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.
బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకం
గూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమిః గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమిః నిజదారసుతోదరపోషణార్థమై."

ఈ పద్యములే నిదర్శనములు.

శిధిలమైన యితని గ్రంథభాగముల నితని శిష్యులు వెలిగందలనారయ, బొప్పరాజు గంగయ, ఏర్చూరి సింగనలు పూర్తిజేసిరి. ఇతని గ్రంథములు భోగినీదండకము, భాగవతము, వీరభద్రవిజయము, నారాయణశతకమందురు. కాని వీనిలో శైలినిబట్టి పూర్తిగా నారాయణశతక మితనిగాదని తోఁచుచున్నది. వీరభద్ర విజయమును గొంత సందేహము గనే యున్నది. భోగినీదండక మితనిదిగాదను వాదమున్నది.

కావ్యము:- భారతీయ సాహిత్యమున నుత్తమ గ్రంథములు రామాయణ భారత భాగవతములు. ఇంతకుముందు పాఠములలో భారత రామాయణములగూర్చి తెలిసికొంటిమి. ఇప్పుడు భాగవత ప్రాశస్త్యము నెన్నవలయు. భాగవతము పదునెన్మిది పురాణములలో నొక్కటి. పురాణమనఁగా సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితమను నైదులక్షణములతోఁ గూడినది. ఇందు దైవ మహిమేగాక పూర్వరాజులు, దేశచరిత్ర వ్రాయఁబడియున్నది. భగవంతుని లీలలు వర్ణింపఁబడిన ముఖ్య గ్రంథము భాగవతము. వేదములు, ఉపనిషత్తుల సార మిందిమిడియున్నది. అర్థము గాని వేదాంతవిషయములు హరికథలద్వారా నిందు పొందుబఱచఁబడియున్నవి.

"అతిరహస్యమైన హరిజన్మకథనంబు
మనుజుఁ డెవ్వఁడేని మాపురేపు
చాలభక్తితోడఁ జదువుడా సంసార
దుఃఖరాశి బాసి తొలఁగిపోవు"

నటులఁజేయునది భాగవతమట. భక్తియోగము, అద్వైత సిద్ధాంతము భాగవతమున స్పష్టముగఁ దెలుపఁబడియున్నది. ఇందలి వేదాంతవిషయ కాఠిన్యమును బట్టి—

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలి కైన
విబుధ జనుల వలన విన్నంత గన్నంతఁ
దెలియ వచ్చినంతఁ దేటపఱతు."

నన్నాఁడు పోతన. భాగవత భాగవతములకు స్కంధములనిపేరు, ఇవి పండ్రెండు. ఇందు ప్రధానమైనది శ్రీకృష్ణ చరిత్రను దెల్పు దశమస్కంధము. ఈ భాగములోనిదే మన పాఠ్యభాగము.

కవిత:- పోతన కవిత ద్రాక్షాపాక సంశోభితము. దీర్ఘసంస్కృతసమాసభూయిష్ఠమైనను భావములు సులభములై, లలితములై యుండును. మూలభాగవతమున కిది వ్యాఖ్యాన ప్రాయమై వివరణాత్మకముగనుండును. అందుచేఁ దెనుఁగు భాగవతమున పద్య సంఖ్య పెరిగినది. శబ్దాలంకారములతో నింపినను తెలుఁగు నుడికారము, పలుకుపసందు కమ్మగనుండును. ఇతనికంత్యానుప్రాసము, యమకమున్న నతిప్రీతి. కీ.శే. కట్టమంచి వారీతనిది "లింగులింగు మను జంగాలగంటశైలి" యన్నను ముద్దు ముద్దు మాటలయినను గంభీరార్థములను మనోహరముగఁ జిత్రించు నేర్పుగలవాఁడు. సంగీత సాహిత్యములు మేళగించిన యితని పద్యములు వీనులకు విందులు. పండిత పామరులు చదివి విని యానందింపఁబడునది భాగవతము. ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షము, వామనచరిత్ర, కృష్ణలీలలు, రుక్మిణీ కల్యాణము మున్నగునవి మిక్కిలి రసవత్తర ఘట్టములు. పోతన కవిత్వమున నుభయరేఫ మైత్రి, ద్రుతసంధియను దోషములున్న వందురు.

## కథాసారాంశము.

కలహ విద్యయందారితేఱిననారదుఁడు కాలయవనుని కృష్ణునిమీఁదఁ గయ్యమునకుఁ గాలుదువ్వఁజేసెను. కలహబీజము లంకురితములయ్యెను. మూఁడుకోట్ల మ్లేచ్ఛులతోఁ గాలయవనుఁడు మధురపై దండెత్తెను. శ్రీకృష్ణ బలరాములు విశ్వకర్మచే సముద్రమధ్యమున నొకనగరము ను నిర్మింపజేసి మధురాపురిజనుల నందు సురక్షితముగఁ జేర్చెను.

ఒక్కఁడే నిరాయుధుఁడై శ్రీకృష్ణుఁడు యవనునికెదురేగెను యవనుఁడు నారదుఁడు చెప్పినపురుషుఁడతఁడేయని గుర్తించెను. హరిని పట్టంబోయెను. కాని యతఁడు చిక్కలేదు. ముందు వెన్నుఁడుపఱుగెత్త, వాని వెన్నంటి యవనుఁడార్చుచుఁ దఱుముచుండెను. కొండలు కోనలెన్నియో ద్రిప్పినాఁడు కృష్ణుఁడు. తుదకొక్క శైలగుహలో నిదరించుచున్నట్టు లభినయించెను. చేఁజిక్కెనని యుత్సాహమున గాలయవనుఁడటకేఁగి కృష్ణుని నిందించుచుఁ గాలఁదన్నెను. శ్రీకృష్ణుఁడు లేచి నీల్గి మెల్లన కన్నులుదెఱచి యగ్నిజ్వాలలతోఁ గాలయవనుని భస్మముగావించెను.

## ప్రశ్నోత్తరములు.

1. శ్రీ కృష్ణుఁడెట్లు కాలయవనుని జంపెను?

2. కాలయవనుని మృతికి నారదుఁడేవిధమున గారణభూతుఁడయ్యెను?

యవనుఁడు జరాసంధ మాగధుల మిత్రుఁడు. దుర్మార్గుఁడగురాజు. శ్రీకృష్ణుని విరోధి వర్గములోనివాఁడు. వానిప్రేలితో వానికన్నులే పొడిచినట్లు నారదుఁడొకసారి యాదవా! నీవు సమస్త రాజన్యుల జయించితివి. యాదవుల నేలగెల్వవు? వారిని మఱచితివా? లేక వెఱచితివా? లేక నీకుదర్పమేలేదా? యాదవులలో మేటి, జరాసంధాదులఁదోలిన వాఁడొకఁడున్నాఁడు అతనివంటి వీరుఁడింకొకఁడు లేఁడు వానిని గూర్చి నీవువినలేదా! యని వానినిరెచ్చఁగొట్టెను. యవనుండామాటల కాతురతో "నారదా! ఆ వీరుఁడెవరు? ఏరూపువాఁడు? ఏపాటిభుజశక్తిగలవాఁడు? నాతోనని నిలువఁగలఁడే? చెప్పుమా యని యడిగెను

అందులకు నారదుఁడు నీలమేఘచ్ఛాయ నుండువాఁడు ఉన్నతదీర్ఘబాహుఁడు, దిక్కులన్నిఁట మెఱయునాఁడు అతనిని పట్టనేర్చినను లోఁబడఁడు. అతనింతింతవాఁడనలేమఁనగ, యవనుఁడు లక్ష్యముచేయక యిట్లనియె "యాదవుఁడనఁగానెంత? ప్రళయాంతకునైన యుద్ధమున ఢీకొనగల వీరుఁడను. నాధనస్సునుండి వెడలిన బాణాగ్నిజ్వాలలచే వానిని భస్మముజేసెదను యవనునికీవిధముగ యుద్ధప్రోత్సాహము గల్గినది. నారదుని కలహబీజము లు బాగుగ మొలకలెత్తినవి. కాలయవనుఁడు మూఁడుకోట్ల మ్లెచ్ఛవీరులతో మధురపై దాడి వెడలెను.

ఈ యపారసైన్యమును బలరామకృష్ణులు గాంచిరి. యవనుఁడు పరమదుర్మార్గుఁడు, వీనిననుసరించి నేఁడో రేపో మాగధునిదళములు రాఁగలవు. ఈదుష్టులు ప్రజల, బంధువుల జంపెదరు లేదా చెఱబట్టి హింసల పాలుగావింతురు. కాన వీనిబారినుండి ప్రజల రక్షింపవలెను అని వారు తర్కించి విశ్వకర్మచే సముద్రమధ్యమున నొకనగరమును నిర్మింపఁజేసిరి. అచటికి యోగప్రభావంబున కృష్ణుఁడు మధురానగర జనులసందఱిని క్షేమముగఁ బంపెను. నందనవనమును దాఁటివచ్చు ఐరావతమువలె, మేరుపర్వత గుహనుండి వెలువడు సింహమురీతి, తూర్పున నుదయించు ప్రభాకరుని మాడ్కి శ్రీకృష్ణుఁడు నిరాయుధుఁడై మధుర నుండి యవనుని వైపు వచ్చుచుండెను.

విరోధి నిరాయుధుఁడై తనకడకేవచ్చుట కాలయవనునకు మహదానందమాయెను. చేఁజిక్కెఁగదాయని యిట్లు పరిహసించెను. ఏనుఁగులులేవు; గుఱ్ఱాలు, దండు దళములు రావు; ఆయుధములంతకుముందేసున్న. అదిగో నగరద్వారముదాఁటు హరిని చూచితిరా? ఈ నగరిపై గయ్యమునకువచ్చి చాలదినములయ్యెను. నిరాయుధుఁడై మున్నెన్నడిట్లు వీఁడు రాఁడు, ఈనాఁడు నన్ను ఓడించుటకో లేక ప్రియోక్తులకోయిటకు వచ్చుచున్నాఁడు" అంత కంతకుఁ జాల సమీపించినాఁడు కృష్ణుఁడు, ఆకృతిని నారదుఁడెఱిఁగించిన వాఁడీతఁడేయని యా మూఢుఁడప్పటికి గుర్తించెను. బ్రహ్మాది మహా మహులకుఁ బట్టరానివానిని నే నిదేపట్టెదనని గుఱ్ఱమును ముందునకు గదలించి గర్జించెను.

కాలయవనుఁడు పట్టరాఁగా క్షణములో పట్టుదప్పి పటువేగమున కృష్ణుఁడు ముందు వకుఁ బఱువెత్తెను. కాలయవనుఁడు వెన్నంటెను. "యదువంశోత్తమా! కంసాదులను జంపినవాఁడవు. నీతోఁబోరవచ్చితిని. ముందునకు పోఁబోకుమా! నీటోటిప్రఖ్యాతరాజవరుఁడు శత్రువులకు వెన్నిచ్చి కళంకము దెచ్చుకొందురే? ఓమాధవా! నిన్నీనాఁడు తప్పక బంధించెదను. నీటిలోఁజొచ్చిన, బాతాళమున బలిదండనిల్చినను, కొండలెక్కినను, దొంగవేషములు వేసినను నిన్ను వదలను. అంతేగాదు నీవలె నేనును నిరాయుధుఁడను. నీకింత భయమేల? బాణములుదూఱవు. ధనుష్టంకారధ్వనులు వినవు. నగవులపాలై యేల పర్వెత్తెదవు? బలేధైర్యశాలివి. ఇట్టివాఁడవు ముందు కాశియునితో, కేశితో, కువలయాపీడముతో, చాణూరముష్టికులతో, జరాసంధునితో, కంసునితో నెట్టులఁ బోరినాఁడవయ్యా?" యని పరిహసించుచుఁ గాలయవనుఁడు వచ్చుచుండెను.

శ్రీ కృష్ణుఁడీమాటల సరకుచేయలేదు. "వేగిరపడకు రమ్ము రమ్ము" ని యని కాహ్వానించెను. లోఁబడినట్టు లభినయించి కృష్ణుఁడు కుప్పించిదాఁటును. వరుగువట్టలేమని భావింప వానిదగ్గఱనిల్చును. ఈ విధమున వనములు, కొండలు, కోనలు ద్రిప్పించెను. కాని పట్టువడలేదు, కట్టకడకు కృష్ణుఁడొక కొండగుహఁజొచ్చెను. లోపల నిద్రబోవు వానిపలె గుఱువెట్టుచుండెను, అధికరోషంబున వానిజేరి కాలయవనుఁడిట్లు నిందించెను. "పురుషాధమా! నాతోఢీకొనలేక పఱుగెత్తివచ్చితివి. ఈగుహలో దొంగనిద్ర నభినయించిన

నిన్ను బోనిత్తునా? ఎక్కడ నెవ్వరికి చిక్కవని నారదుఁడు చెప్పెను. కాని యిక్కడ నాకు జిక్కితివి. ఇంకెక్కడకు పోఁగలవు? ఈకొండలోనే నిన్ను దీర్ఘనిద్రపుచ్చెదనని యట్టహాసము జేసెను. వజ్రాయుధ సమానమైన దనపాదమున కృష్ణుని తన్నెను. ఆదెబ్బకు శైలగుహలు ప్రతి ధ్వనించెను.

ఆ తన్నుతో హరిలేచి నీల్గి, మెల్లగాఁ గన్నులు విచ్చెను. కోపాగ్ని జ్వాలలతో నా యవనుని భస్మము గావించెను. ఈవిధమున నారదుని మూలమున గాలయవనుఁడు మృతి నొందెను.

## సందర్భ సహిత వాక్యలు.

### 1. పట్టనేర్చిన గాని లోఁబడని వాఁడు:— 7 ప.

ఈవాక్యము పోతన భాగవతమ లోనిది. నారదుఁడు కలహవిద్యావిశారదుఁడు. కాలయవనుని గడముట్టింపనెంచెను. దాని కై వానిని శ్రీకృష్ణునిపై నెదుర్కొన బురికొల్పు సందర్భములోనిదీవాక్యము. "యాదవా! ఎంతఱోరాజులఁ గెల్చితివి. యాదవులపైనేల దండెత్తవు? యాదవులలో నొక మేటి వీరుఁడున్నాఁడు. అతనిసాటి వాఁడీయిలలోలేఁడు." అని చెప్ప నుత్సాహమున యవనుఁడాతని గూర్చిన వివరములడిగెను. అందులకు నారదుఁడు కృష్ణుని గొప్పదనమిటుల వర్ణించెను. అతఁడన్ని దిక్కులఁ దిరుగును. ఒరులతని బట్టుటకుఁ బ్రయత్నించి పట్టగల్గినను అతఁడు వారికి లోఁబడఁడని భావము.

### 2. భస్మము జేసెదఁ దాపసోత్తమా! :— 9 ప.

ఈవాక్యము పోతన భాగవతమందలిది. నారదుఁడు కాలయవనుని జంపింపనెంచెను. అతనిని శ్రీకృష్ణునిపైఁ గయ్యమునకుఁ గాలు దువ్వఁజేసెను. కృష్ణుని పరాక్రమాదులు నారదుఁడుచెప్పవిని యలక్ష్యముతోఁ కృష్ణునిధిక్కరించుచుఁ బైవిధమున నాడెను. యాదవుఁడననెంతవాఁడు? ప్రళయాంతకుఁడెత్తి వచ్చిన యుద్ధమున నెదుర్కొందును. నాబాణాగ్ని జ్వాలల వానిని భస్మము జేసెదనని నారదునితోఁ బల్కెను.

### 3. అరికిన్ వెన్నిచ్చి యిబ్బంగి నేఁగుదురే రాజులు?— 24 ప.

పోతన భాగవతము లోనిదీవాక్యము. కలహ విద్యా విశారదుఁడగు నారదుఁడు యవనుని కృష్ణునిపైఁ గయ్యమునకుఁ గవ్వించెను. కాలయవనుఁడు మూఁడుకోట్ల మ్లేచ్ఛులతో మధురపై దండెత్తెను. శ్రీకృష్ణుఁడొంటరిగవచ్చి చిక్కినటులభినయించి పర్వెత్తెను. యవనుఁడప్పుడు కృష్ణుని పరిహసించుచుఁ బైవిధమున బల్కెను.

ఓయీ! యదువంశోత్తమా! పోకు పోకుము. రణరంగమున శత్రువుల నెదుర్చు టర్హము కంసాదులఁ జంపిన మొనగాఁడవని వచ్చితిని. నీప్రఖ్యాతలుమంటగలియునటులేల వెన్నిచ్చి పఱుగెత్తుచున్నావు. రాజులీమాదిరి భయపడి పాఱిపోదురా. యని యడిగెను.

### 4. నిక్కముగా నిద్రవుత్తు నిన్నీ కొండన్— 37 ప.

పోతన భాగవతమందలి దీవాక్యము. శ్రీకృష్ణుఁడు యవనునకుఁ జిక్కక కొండలు, కోనలు, త్రిప్పి త్రిప్పి బాధించెను. కట్టకడకొక శైలగుహఁజొచ్చి యందు నిద్రబోవు వాని వలె నుండెను. కాలయవనునకిది సులభముగాఁ దోఁచెను. తప్పక చంపఁగలనని గుహలోఁ బ్రవేశించెను. కృష్ణునిజూచి "పురుషాధమా! యుద్ధముజేయలేక యెంతదూరము బఱువెత్తితివని నిందించు సమయమున నీపలుకులు బల్కెను.

నిన్ను నిజమైన దీర్ఘనిద్రనేపుత్తును. అనఁగా నీకొండలోనే నిన్ను చంపెదననిభావము.

ఈక్రింది పద్యముల ప్రతి పదార్థములు, భావములతిముఖ్యములు.

8, 27, 36, 39.

# పాఠకులకు మనవి.

113 నుండి 116 పుటలవఱకు సంఖ్య మాత్రమే పొరబాటున విడువఁబడినది. కాని నోట్సుమాత్రము పూర్తిగ, వరుస క్రమముగ నున్నది.

# మారవిలాసము

## కిరాతార్జునీయము

---

### అర్థాదులు.

1. మాటలు + ఔను, తప్పు + అనక = మాటలు అగును, తప్పనక: ధనంజయుఁడు = అర్జునుఁడు; అభవున్ = శివుని; ఏకనిష్ఠన్ = ఒకే ఉనికితో (దీక్షతో).

2. భసిత = బూడిదతో; ఉత్ + ధూళిత = పైన దుమ్ము గావింపఁ (పూయ) బడిన; నిర్మల + అవయవుఁడున్: పంచ + అక్షరీ = నమశ్శివాయ యనెడి మంత్రమును; సంతత = ఎల్లప్పుడు; అభ్యసన = నేర్చుటలో (జపించుటలో); వ్యాప్తి = వ్యాపించిన; పరాయణుండును = ఆసక్తిగలవాఁడును; అనుసంధాతయున్ = చింతనము చేయు వాఁడును; మసృణ = చిక్కని; స్నిగ్ధ = నున్నని; తరక్షు చర్మమయ = సివంగి తోలుతోఁగూడిన; కంధ = బొంతగల; భద్ర = శుభములనిచ్చు.........అసమ = సమయముగాని; స్థేమన్ = శరీరబలముతో; కిరీటి = అర్జునుఁడు.........దీక్ష = వ్రతముయొక్క; ఆరంభమున్ = మొదలింటిని.

తా॥ భస్మమలఁదిన నిర్మలాంగుఁడును, పంచాక్షరీమంత్రము నెల్లప్పుడు నేర్చుటలోనాసక్తుఁడును, శివుని చింతన జేయువాఁడును, శివంగితోలు భద్రాసనమున గూర్చున్న కిరీటి గొప్ప బలముతో పాశుపత దీక్షఁబూనెను.

3. ప్రథమ = మొదటి; సంధ్యారాగ = సంజవేళ ఎఱుపు కాంతియొక్క; పరిపాటి = క్రమమును; మిన్ను + ఏటి = ఆకాశ గంగలోని; కనక = బంగరు; పంకజ = తామరలయొక్క; కోరకములు = మొగ్గలు; కందు + పాడిన = నలుపు పోయిన; మించు = ప్రకాశించు; విధుమండలము = చంద్రమండలము; దరము + ఐన = భయమైన; తఱపి = నిండు యౌవనపు; దివిన్ = ఆకసమున; కూట = పర్వతముయొక్క, అత్తమిల్లన్ = అస్తమించఁగా; మృదుల = మెత్తని; భస్మరజన్ = బూది దుమ్ము యొక్క; శయ్య = పడకనుండి.

**కృత్తికా నక్షత్రము :** అశ్విన్యాది యిరువదియేడు నక్షత్రములు చంద్రుని భార్యలని పురాణ ప్రసిద్ధము. అమావాస్యపోయిన మఱుదినమునుండి చంద్రుఁడు వరుసగా నొక్కొక్క నక్షత్రస్థానమున సంచారము చేయును. ఇట్లు 2¼ నక్షత్ర భాగములే

మేషాది 12 రాశులు. పూర్తిగా రోహిణీ నక్షత్రము వఱకు బోయిన నొక్క చంద్ర మాసమగును. అర్జునుఁడు తెల్లవాఱుజామున లేచునప్పటికి శుక్లపక్షమున తదియనాటి చంద్రుడు ముందే యస్తమింప నిఁకమిగిలిన యానాఁటి కృత్తికానక్షత్ర మప్పటి కస్త మించినదని భావము.

4. కపికేతుఁడు = కోతి టెక్కెముగాఁగల అర్జునుఁడు; ప్రపాత = కొండ చఱియనుండి పతయాళు = పడుచున్న; నిర్ఝర = సెలయేటిలో; స్నాతుండు+ ఐ = స్నానముజేసిన వాఁడై; తపన + ఉదయవేళన్ = సూర్యుఁడుదయించు సమయమున; వ్యాళధరున్ = శివుని.

పాము:- సర్పః ప్రదాకుర్భుజగో భుజంగోహిర్భుజంగమః
ఆశీవిషో విషధరశ్చక్రవ్యాళ స్సరీసృపః
కుండలీగూఢ పాచ్చక్షు శ్రవాః కాకోదరః ఫణీ
దర్వీకరో దీర్ఘపృష్ఠో దందశూకో బిలేశయః
ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః —అమ.

5. పాకశాసనసుతుండు = దేవేంద్రనందనుఁడగు నర్జునుఁడు; అవధానంబున = పర ధ్యానములేక; అర్ధ+ఇందు కోటీరున్ = చంద్రరేఖను కిరీటముగఁగల్గిన శివుని; సంగవ (సంగమ) కాలంబున = సంధ్యాసమయమున; హిమవాః = మంచునీటి యొక్కయు; కాల+అగురు = నల్లని అగురుగడ్డి; గంధసార = చందనము; సురభి = వాసన; లవలీ = లవలియను తీఁగెలయొక్క; సర్జరస = యక్షధూపము యొక్క; ధూప = వాసననిచ్చు పొగవస్తువులయొక్క; ధూమంబులన్ = పొగలతో.

తా॥ అర్జునుఁడు చంద్రశేఖరుని యొకే లక్ష్యముతో సంధ్యాసమయములందు మంచు నీరు, కర్పూరము, కస్తూరి, కాలాగురు, చందనమాది వాసన ద్రవ్యములతో లవలీ సర్జరస ధూపములతోఁ బూజ సేయును.

6. నిర్జరరాజసూనుఁడు = దేవేంద్రనందనుఁడగు నర్జునుఁడు; మనస్ + వీధి = మనస్సుయొక్క మార్గమున; సదా = ఎల్లప్పుడు; అధ్యాసితన్ = తలంపుతో; మంచుం ..........కాలంబు; పంచబ్రహ్మ = ఐదుగురు బ్రహ్మలతోను; షట్ + అంగ = యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములను ఆఱుఅంగములతో కూడిన; బీజసహిత = బీజాక్షరములతోఁగల; ప్రాసాద = ఇంటియందలి; పంచ + అక్షరి = 'నమశ్శివాయ' అను నైదక్షరముల మంత్రముయొక్క; చంచత్ = ఒప్పు చున్న; మంత్ర పరంపరా = మంత్రముల వరుసలయొక్క; పరమ = గొప్పదగు; నిష్ఠా = నియమమునందలి; తత్పరత్వంబునన్ = ఆసక్తితో; సేవించున్ = పూజించును.

తా॥ అర్జునుఁడు మంచుకొండ యల్లుఁడగు శివుని మనస్సున మధ్యాహ్నకాలమున ధ్యానించును. అతఁడు పంచబ్రహ్మ షడంగ బీజసహితమగు పంచాక్షరీమంత్రము నుచ్చరించుచు మహానిష్ఠతో బూజ సేయుచుండెను.

7. ఆ+ఇంద్ర+ఆత్మజుఁడు = ఆ అర్జునుఁడు; వైయాఘ్రాజిన = పులితోలు యొక్క ఖండమధ్యమున; తేపన్ = ఒప్పిదముగ; బద్ధ = ఉంచఁబడిన; పద్మ+ఆసనుండు = పద్మాకృతిగల ఆసనమువేసినవాఁడు;....శిఖర+ఇంద్ర = శ్రేష్ఠమైన పర్వతమందు; ఆరూఢ = కలిగిన; బిల్వద్రుమః = మారేడుచెట్టుయొక్క; ఛాయ = నీడలో; నిర్మల = శుభ్రమైన; పాషాణప్రదేశంబునన్ = ఱాళ్లుగల స్థలమున; అభవున్....పూజ సేయు.

తా॥ అర్జునుఁడు సాయంసమయములందు ధూర్జటి నీవిధముగఁ బూజించును. ఇంద్రకీల పర్వతముమీఁద మారేడుచెట్టు నీడలో చంద్రకాంతపు ఱాళ్ళపైన పులిచర్మమును పఱచి దానిమధ్య నొప్పిదముగఁ బద్మాసనమున సంధ్యానటుఁడైన శివుని యర్చించును.

8. పార్థుఁడు = అర్జునుడు; సంస్కృత+అర్థుఁడు+ఐ = శ్రేష్ఠమగు కోరికగలవాఁడై; అర్ధ నిశ = నడురేయి; గురు+ఉపదేశ = పెద్దలుపదేశించినట్టి; పదవీ = మార్గమందలి; పరిశుద్ధ = పవిత్రమైన; సమ్+అర్చనావిధిఁ = పరిపూర్ణ పూజాపద్ధతితో; కాంచన కోరకంబులఁ = బంగారు తామరతూండ్లచే; శుకప్రసవంబులఁ = దిరిసెనపు పూలతోను; కందర = గుహలయొక్క.

తా॥ అర్జునుఁడు శ్రేష్ఠమగు కోరికతో మేరువు గుహలలో శివుని యర్ధరాత్రివేళ పూజించును. భక్తితో గురూపదేశ ప్రకారము తగిన పూజాపద్ధతితో బంగారు తామరతూండ్లు, దిరిసెన పూవులు కొండ గోగులతో నర్చించును.

9. పాశు....ధరుఁడు+ఐ = పాశుపతాస్త్రమును బడయుటకై చేయు నియమమునందు చాకచక్యముగలవాఁడై; కాలకంధరుఁ = నల్లని మెడగల శివుని.

10. గిరి = పర్వతముయొక్క; కూట = శిఖరమందలి; ఉత్సంగ భాగంబునఁ = మధ్య భాగమున; వికచ = వికసించిన, కోరకముల్ = మొగ్గలు; కుర్కుర = కుక్కల యొక్క; ప్రకర = గుంపుయొక్క; ఉదంచిత = విజృంభింపఁబడిన; కంఠనాళ = గొంతు గొట్టమునుండి వచ్చిన; కుహలీ = కుహల్ అను వాద్యమువంటి ధ్వనులు.

పర్వతము:- 'మహీధ్ర శిఖరి క్ష్మాభృదహార్య ధరపర్వతాః
ఆద్రిగోత్ర గిరిగ్రావాచలశైల శిలోచ్చయాః' ....అమ.

11. కేసరులు = సింగములు; పిసరులు+ఐ = తునకలై; జల్లుకొని = వాన జల్లువలె గుంపుగాఁజేరి; సారమేయయూథములు = కుక్కలగుంపులు; ఉద్ధతముగ = గర్వముగ.

అలం: సారము.

12. ప్రకటలీలన్ = వెల్లడియగు విధముగ; ఉదాత్తంపు పఠితిన్ = వేదఋక్కుల నుచ్చరించు ఎత్తుస్వరపద్ధతిని; అనుదాత్త = అనుదాత్తమను తగ్గుస్వరము; స్వరితములన్ = స్వరితములను స్వరములచేతను; ప్రచయము = అనుదాత్తమున విశేష స్వరము; ఘోషణము = శబ్దము.

13. శృంఖలలు = సంకెలలు (గొలుసులు); త్రయీశకంబులన్ = ఋక్ యజుస్సామ వేదములను మూఁడు రూపములుగల మూఁడు కుక్కలను; మూరెలన్ = ప్రక్కభాగము లందు; ఇరుపక్కియ = రెండుప్రక్కల; లీల = వినోదార్థముగ; కపటమై హరిసఁచు +ఐ = మోసముగ విహరించువాఁడై.

14. వికట = చక్కనైన; పాటల = తెలుపు ఎఱుపు రంగులు కలిసిన; జటా = జడల యొక్క; మకుటిక = కిరీటము యొక్క; జుంజుఱు నెఱులు = చింపిరి వెంట్రుకలు; చారు = అందమైన; సుధాధామ = చంద్రునియొక్క; శకల = రేఖయొక్క; అవతంసంబు = సిగబంతి; పెడగొప్పు = వెనుక త్రిప్పికట్టినముడి; పీఁకె = ఆఁకుచుట్ట (పిట్టయీఁకె); కనుచిచ్చు = కంటియొక్క నిప్పు; గైరికద్రవ = కొండలలోని కావు ధాతువుల ద్రవము యొక్క; తిలకము = బొట్టు; భుజగహారము = పాముల సరములు; గుబ్బసరులు = మణులపేరులు; శంకరుండు—శుభము నిచ్చు శివుఁడు; అగజ = పర్వతరాజ పుత్త్రియగు పార్వతి; ఓంకార దివ్యచాపము = ఓమ్ అని ధ్వనించు పినాకమను శివుని మహత్తరమగు విల్లు; విప్పచ్చు = అర్జునునియొక్క అలం: సముచ్చయము, వృత్త్యనుప్రాసము.

18వ పద్యములోని పంది వర్ణనమిటఁ జూడవలెను.

16. జలధర = మేఘములవంటి;.... ........చంద్రకళ = చంద్రరేఖలయొక్క; యుగళీ = జంటలో; సమాన, దంష్ట్రిలు = కోరలు, భిదుర = వజ్రాయుధముతో, ఉపమాన = సాటియగు; ముఖసంపుట = మొగముయొక్క దొప్పలతోఁగూడిన; పోత్రము = పంది మూఁతి; ఫుల్ల = వికసించిన; మేచక = నల్లని (చీకటిఁవంటి); ఉత్పలదలవర్ణ = నల్ల కలువరేకుల వంటి రంగుగల; కర్ణములు = చెవులు; పాటల = పాటలవర్ణముగల; వర్తుల = గుండ్రని; లోచనంబులన్ = కన్నులను; కలిగి, కఠోర = భయంకరమైన; కంఠ = గొంతుయొక్క; ఘన = గొప్పవియగు; ఘుర్ఘుర ఘట్టన = ఘురఘురమను గట్టనలయొక్క: ఘోష = ధ్వని; జన్మమై = పుట్టుకతో.

'స్యాదుత్పలమ్ కువలయమ్' —అమ.

తా॥ మబ్బువంటి నల్లని శరీరమును, చంద్రరేఖల జంటకు సమానమనఁదగు రెండు కోరలును, వజ్రాయుధముతో సాటివచ్చు మూఁతి ముట్టెయును, విస్తరించిన,

నల్లకలువరేకులవంటి నల్లని చెవులును, పాటల వర్ణముగల కన్నులనుగలిగి భయంకర మగు ఘుర్ఘురమను గట్టిన ధ్వనుల పుట్టుకలో నొక పంది వచ్చెనని భావము.

17. ముట్టియలన్ = మూతిముట్టెతో; తటమూల = కొండచరియభాగములందలి; మహీప్రభవంబులు = భూమినుండి పుట్టినట్టివగు చెట్లను; గ్రొచ్చి = కూల్చి; భూరుహషండములన్ = చెట్లగుంపును; మట్టుచు = త్రొక్కుచు; క్రాయుచున్ = కక్కుచు.

తా॥ ఇంద్రకీల పర్వతపు చరియలోని పుట్టలను కూల్చివేయుచుండెను. చెట్లను చాఁపకట్టుగాఁ ద్రొక్కుచుండెను. మాటిమాటికి దిగంతముల ఘట్టనజేయుచుండెను. నిడుదలైన కన్నులనుండి నిప్పులు గ్రక్కుచుండెను. అలం : అతిశయోక్తి.

18. పురందరనందను = ఇంద్రనందనుఁడగు నర్జునునియొక్క; నిశాకరధ్వజు = చంద్రధ్వజుఁడైన శివునియొక్క; దందడి = తఱచుగ; గొరిజల = గిట్టలయొక్క; కందుకములు = బంతులు; గుదువాఱంగన్ = గులకఱాలనేలకాఁగా. అలం : ఉపమ.

పంది :- 'వరాహస్సూకరోఘృష్టిః కోలఃపోత్రీ కిరిః కిటిః
దంష్ట్రీఘోణీ స్తబ్ధరోమా క్రోడో భూదార ఇత్యపి' —అమ.

19. వాసవసూతి = అర్జునుఁడు; గాడిపాఱన్ = నాటిపోగా; శరఘాతవేదనన్ = బాణము దెబ్బవలని బాధతో; మూక + అసుర సూకరంబు = పందిరూపముననున్న మూకాసురుఁడు.

తా॥ శివుఁడు పినాకచాపమున బాణముల వదలెను. అర్జునుఁడు గాండీవమున వజ్రసమాన బాణముల నేసెను. పందిరూపమున వచ్చిన మూకాసురు నీ బాణములు ప్రక్కల నాటిపోయినవి. బాణములు గుచ్చుకొన్న దెబ్బకు రక్కసుఁ డిటునటు దిరుగాడెను.

20. విలయవేళ = ప్రళయకాలమందలి; ఘన = గొప్పదియగు; ఘనాఘనము క్రియన్ = మేఘమువలె; అభవ = శివునియొక్కయు; శరపాత = బాణములు పడుటచే; సంక్షుభితము = మిక్కిలి కలఁతఁజెందినది. అలం : ఉపమ.

21. తీర్ణతర = మిక్కిలి వాడియైన; హర = శివునియొక్క; వర + ఆశుగ = శ్రేష్ఠమగు బాణముయొక్క; నిర్ఘాత = పిడుగువంటి; నిపాత = పడుటచే; జాత = పుట్టిన; నిబిడ = ఎక్కువగు; వ్యథన్ = బాధచే; క్రోడము = పంది; కూలెన్ = చచ్చెను.

22. పుర + అరి = మూఁడు పురముల రూపముననున్న రక్కసుల శత్రువగు శివుఁడు; నిలుకడ (వి)—నిల్చు (క్రి); వలకేల = కుడిచేత; వలపల × దాపల; జెట్టి = మల్లుఁడు (శూరుఁడు); ప్రావృషేణ = వర్షకాలమందలి; పయోవాహ = మేఘముల యొక్క; స + ఆటోపముగా = వేగిరపాటుతో; స + అవష్టంభంబుగా = గర్వముతో.

మేఘము :— 'అభ్రంమేఘో వారివాహః స్తనయిత్నుర్బలాహకః
ధారాధరో జలధర స్తటిత్వాన్వారిదోంబుభృత్
ఘనజీమూత ముదిర జలముగ్ధూమ యోనయః' —అమ.
అలం: అనుప్రాసము.

24. తరళ+అక్షి = మెఱయు కన్నులుగలది; కిటిణ = పందిని.

25. ఏటులవిణ = ఏటునకందు సూరము; ఓటమి = పరాజయము; కాయు+ఎయుకనణ = గాయముయొక్క గుఱ్ఱుచే; చీటంబున = అటయందలి.

26. సత్త్వహింస = జంతుహింస; కల్మష+ఆత్మ = పాపి. అలం: నిదర్శన.

27. నారసమునణ = బాణముచే; వెంపియు = మఱీ; రండాసుత = ముందెకొడుక (భర్త పోయినవెనుక పుట్టినవాఁడని దూషణ).

బాణము :— 'పృషత్క బాణవిశిఖా అజిహ్మగ ఖగాశుగాః
కలంబ మార్గణ శరాః పత్రీరోప ఇషుర్ద్వయోః' —అమ.
'అళిబాణౌ శిలీముఖౌ' —అమ.

28. అబసరము (రూ) అవసరము; శవము (ప్ర)—సబము (వి); పర+అటవిక = ఇతర బోయయొక్క; ఆయత = విశాలమైన, చాపవల్లరి = తీఁగవంటి వింటినారినుండి వెడలిన; నిబిడ = దట్టమైన; శర = బాణములచే; హతంబు+అగు = చచ్చినదగు; నిశాత = వాడియైన; శిలీముఖము = బాణము.

తా॥ నీవు మునివిగాన చావునుండి తప్పించుకొంటివి. నీకేమి వేఁట పంతమా? ఇతర బోయనిచే హతమైన జంతువును గొట్టితివి. పీనుఁగుపై విసరిన నీ వాడిబాణమెట్టి వెట్టిదోగదా!

30. సెగ్గే = నింద్యమే? శబర = బోయవాఁడా.

బోయఁడు :— 'చండాల ప్లవమాతంగ దివాకీర్తి జనంగమాః
నిషాద శ్వపచా వంతేవాసి చాండాల పుల్కసాః'
బేధాః కిరాతశబర పుళింద మ్లేచ్ఛజాతయః. —అమ.

31. కందువుగాక+అ ఫలము = దాని ఫలితమును చూచెదవుగాక; కందువుగా, కాఫల మనియు నన్వయింపవచ్చును.

32. తడవు+ఔదెంచె = ఆలస్యము కాఁజొచ్చెను; అటవి = అడవియందలి; పంక్తి = వృక్షాదులు వ్యక్తమగుచోట్ల; వాగ్వివాదము = మాటపట్టింపు; వాక్+వివాదమని సరియైన రూపము. ఇది శ్రీనాథుని స్వేచ్ఛాప్రయోగములలోనిది.

33. జోటి = స్త్రీ; కుర్కురకోటి = కుక్కలగుంపు; ధాటి = దండయాత్ర.

తా॥ బోయరాజా! ఆలస్యమైనది. మధ్యాహ్నము కాఁబోవుచున్నది. మాకిది శివార్చన వేళ. ఏకాంతముగా నుండవలయు. నీవును మిక్కిలి యలసినావు. కోపము వలదు. శాంతి గైకొనుము. వాగ్వివాదమేల?

34. గజ్జుల + అఁడు = మదించినవాఁడు; మోహంబున = మూర్ఖములో.

35. తాటియంత = తాటిచెట్టంత; జ్యా = వింటినారియొక్క; కిణ = రాపిడిచేఁగల్గిన కాయలచే అంకితము = గుర్తులుగలదిగాఁ చేయఁబడినది.

36. భామ = స్త్రీ; ఉబ్బు = సంతోషించు; నిస్సీమంబే = హద్దులేనిదే; నిగుడింపుమా = ప్రసరింపుమా.

తా॥ నిన్నుజూచి నా హృదయమేమో పరాధీనమగుచున్నది. నాభామ యెద ఉబ్బుచున్నది. నీ భుజబలమంత గొప్పదైనచోఁ గొంతసేపు నాపైన శక్తిని జూపుమా. బాణములు వేయుమా!

37. అంచలమునఁ = మొనయందు; సెదాసు (రూ)-సేనాసు.

38. ఉపద్రవము = కీడు, అనుసంధానముల్ = కూర్పులు (కంయికలు); అవార్యంబుగఁ = పోఁగొట్టుటకు వీలులేనట్లుగా.

తా॥ శివార్చన యెక్కడకుపోదు లెమ్ము. తపస్సున కుపద్రవములేదు. కొంచెముసేపు ధ్యానమును నిల్పలేవా? నా యెదుట నాశ్చర్యమగు నీ భుజబలపరాక్రమ మహోత్సవ మును జూపుమా.

39. ప్రదరము = బాణము; అరి + పోయుము = అల్లెత్రాటి నడిమిభాగమును సంధించుము; ప్రాక్ + ప్రకార = ముందటి పోలికయొక్క; కౌతుక = ఉత్సాహమునకు; అధీన = లోఁబడిన; హృదయమందు; వీర + ఆహవములు = వీరులొనర్చు యుద్ధములు.

40. గుణ = అల్లెత్రాటియొక్క; జలధర = మేఘముయొక్క; నిష్ఠ = ఏనుఁగును పొడుచు కోల; గంధద్విపంబుఁ = మదపుటేనుఁగును; అంబరము = ఆకసము; భల్లంబులు = బాణములు. అలం : ఉపమ.

41. కందర్పవిద్వేషి + మన్మథ విరోధియగు శివుఁడు; గాండీవ = గాండీవ ధనుస్సునుండి; ప్రవిముక్త = విడువఁబడిన; నిష్ఠుర = కఠినమైన; మహత్ కాండ ప్రకాండంబులన్ = గొప్ప శ్రేష్ఠమగు బాణములను; ప్రతిబాణ = ఎదురుబాణముయొక్క; ఘట్టనమునన్ = కొట్టుటచే; ఖండించెఁ = త్రుంచెఁ; అతండు = అర్జునుఁడు... శాత = వాడియైన....

తా॥ శివుఁడు కిరీటియొక్క గాండీవమునుండి వదలఁబడిన కఠినమైన శ్రేష్ఠమైన బాణములను ప్రతిబాణములచే ఖండించెను. అందుల కర్జునుఁడాశ్చర్యమునొంది "బాపురే! పుళింద జాతిలో మేటివాఁడా!" అని పొగడుచుఁ దన భుజబలాహంకారముతో మరల వాడి బాణముల నతనిపై వైచెను.

42. క్రూర+ఆజిన్ = భయంకరమగు యుద్ధమున; హేలాగతిన్ = తిరస్కార పూర్వకముగ; విజయ = అర్జునునియొక్క; అస్త్రవ్రాతమున్ = బాణసంచయమును; వ్రేల్మిడిన్ (వ్రేలు+మిడిన్) = చిటికలో.

43. శితికంఠుఁడు = నల్లని కంఠముగల శివుఁడు; బహుళ = విస్తారమైన.

44. హరనరులు = శివార్జునులు; ఘట = గుంపుచేత; నీరంధ్రమైన = దట్టమైన; నభమున = ఆకసమున; కారుకొనియె = క్రమ్ముకొనియె. అలం: అతిశయోక్తి.

45. నభః కటాహము = పెనమువంటి ఆకసము. అలం: అతిశయోక్తి.

46. ఓహరిసాహరి = అవిచ్ఛిన్నముగా (ఆహవ+అంగణభూమిన్ = యుద్ధముయొక్క ముందు భాగమున)

47. శరధులు = అంబులపొదులు; శరధులు = నీటికి స్థానమైన సంద్రములు.

అలం: ఉపమ.

48. కలహక్షోణిన్ = యుద్ధభూమిలో; పినాకపాణి = శివుఁడు; కుహన = మాయగల; కౌటిల్య = మోసముగల; శిల్పంబునన్ = 64 కళలకు సంబంధించిన యుద్ధకౌశలముచేత; శార = శారద్వతుఁడను ఋషి; కుంభసంభవ = ద్రోణాచార్యునియొక్క.

49. ఫాలవిలోచన = మొగమున మూఁడవకన్నుగల శివునియొక్క; మాయాఘటనమునన్ = మాయాప్రయత్నముచేత; ప్రగల్భత = ప్రతిభ.

50. నాయిషుచ్ఛటలకున్ = నా బాణములయొక్క వరుసలకు; కాండక్షీణత = గుంపుతగ్గుట; చిట్టలు = ఆశ్చర్యము; మయిమైన్ = అనాయాసముగ; గంగాధరున్ = శివుని.

తా॥ నా ధనుర్విద్యా పాండిత్యమెటుఁబోయెనో? నా బాణములకు బలము తగ్గును గదా! ఇది యాశ్చర్యమగు విషయము. ఈ బోయఁడీవిధమున బోవునా? యని మిక్కలి గర్వించి యర్జునుఁడు శివునిపై బాణమువేయసాగెను.

51. మృడున్ = శివుని; కపిధ్వజుఁడు = అర్జునుఁడు; అడవన్ = కొట్టుటకు; ఉపుకక = ఎడతెగక (తొలఁగక); గుబ్బలికుమారి = పర్వతనందన (పార్వతి).

52. వణఁచు = పాఱు; మందాకిని = ఆకాశగంగ

'మందాకినీ వియద్గంగా స్వర్ణదీ సురదీర్ఘికా' —అమ.

అవతంస = శిరోభూషణము యొక్క; కుసుమ = పూలయొక్క; మాల్యంబు + ఐ = మాలయైన; శశిరేఖ = చంద్రరేఖ, నెట్టియంబుగ = చుట్టుకుదురుగ; బిగ్గగా = గట్టిగ; అలికనేత్రము = నొసటిమీఁది కన్ను. ఆరజ్యమానము = మనోజ్ఞమై; అగజ = పార్వతి; బెగడు = భయము; మౌళిశృంగాటకంబు = సిగయొక్క చదుకము (నాల్గు త్రోవలుగలియు స్థలము); తాడింపగా = కొట్టఁగా. అలం: అతిశయోక్తి.

53. భుజాదండ = కఱ్ఱవంటి భుజముచేత; కలిత = పొందఁబడిన; చండ = భయంకరమైన, గాండీవ; తాడిత = మోదఁబడిన; ఖండపరశు = శివునియొక్క; పృథు = పెద్దవియగు, జటామండలమున = జడల భాగమున; పింజుగట్టి = గుంపై; మిన్ను + ఏటి = మందాకిని యొక్క; తరఁగపింజు = అలల గుంపు; తాండవంబు ఆడెగా = నటనమొనర్చెను.

అలం: వృత్త్యనుప్రాసము, అతిశయోక్తి.

54. మల్లసంగ్రామకేళి + బాహుయుద్ధముయొక్క ఆటయొక్క; సంభావనములగా = సన్మానములచేత

55. నియుద్ధ = బాహుయుద్ధమునందలి; ఉపతాయిగా = ఒకానొక మల్లయుద్ధ బంధము ఉదా॥ "ఉపతాయిలోఁ దనకొదవిన తోరహత్తము సూపి"—విరాటపర్వము; ఉప లాస్యముగా = లాస్యమను నృత్యవిశేషముగ.

నృత్యభేదములు:-"తాండవం నటనం నాట్యం లాస్యం నృత్యం చ నర్తనే".-అమ.

56. తోరహత్తము, నీసము = ఇవి మఱికొన్ని మల్లబంధ విశేషములు. కడిమి సలిపి = పట్టుదలచూపి; యూరులు = తొడలు; సరభసమున = వేగముగ; హత్తించి = కూడి; నిశ్వాస పవనమునకు = బయటవిడచు గాలికి.

57. దొక్కరము = మల్లబంధ విశేషము; ప్రకోష్ఠ = ముంజేతితోచేయు; పీడన = బాధ మిక్కిలి కను = మూఁడవ కన్ను (శివుని చిచ్చుకన్ను).

58. తాచుచు = చెక్కుచు; పడుచు = శ్రమనొందుచు; ఏచుచు = విజృంభించుచు; ఉడుకుచు = తపించుచు; బాహాబాహిగా = పరస్పరము చేతిచేతితో; ప్రాచీపతి సుతుఁడు = తూర్పుదిక్పతియగు నింద్రతనయుఁడు (అర్జునుఁడు).

అలం: అంత్యానుప్రాసము.

59. విష్టంకించి = మార్కొని, ఢీకొని; శశి + అంక శేఖరుఁడు = కుందేటిని మచ్చగాఁగల చంద్రశేఖరుఁడగు శివుఁడు; అవష్టంభంబులు = గర్వములు (ఉద్ధతులు); కైవారంబు = స్తోత్రము; దిష్టాంత + అంతక = చావును గలుగఁజేయువాఁడు (యముఁడు); ముష్టి = పిడికిటి పోటు.

తా॥ శంకరార్జునులు ధీకొని వారి భుజాగర్వశక్తులు సిద్ధపారణము చుఱింపఁగా పికిలిటిపోవు యుద్ధము జేసిరి. పోరికతే లేనటుల యమునివలె భయంకరమూర్తులై మ్ముష్టియుద్ధ మొనర్చిరి.

60. బొప్ప = పెదవి (రూ) అవుషు; నియుద్ధకేళి = బాహుయుద్ధక్రీడ.

61. పేరణముగా = అంగీని; ఆస్ఫోటించెగా = చఱచెను; వృష + అంకుఁడు = ఎద్దును ధ్వజముగాఁగల శివుఁడు; అతంపు = అద్దునుంపు; అశక = దాఁచక.

62. నిజ = తనయొక్క; బాహా = భుజములయొక్క; గాఢ = గరినమైన; పీడ = బాధచే పరిశ్రాంతుంపు + ఐ = మిక్కిలి యూరటబొందినవాఁడై; అహిరాజ = సర్పరాజు (శేషుని) యొక్క; స్వః + వాహిని = ఆకాశగంగతో కలసిన; వేణితో = జుట్టుముడితో; దంతి = ఏనుఁగు యొక్క; త్వక్ = చర్మము యొక్క; పరిధాన పల్లవముతో = చిగురు వంటి దోవతితో; తామ్ర + జటాపంక్తితో = ఎఱ్ఱని జడల వరుసతో.

అలం : స్వభావోక్తి, అంత్యానుప్రాసము.

తా॥ అంత శివుఁడు తన భుజములబాధచే నూరటబొందినవాఁడై యర్జునునియెదుట దయతో సర్పహారములతో, గంగగల వేణితో, గజచర్మ వస్త్రముతో, ఎఱ్ఱని జడలవరుసతో ప్రత్యక్షమాయెను.

63. అంజలులు = చేమోడ్పులు; ప్రణామము = నమస్కారము; వినీతి = వినయము.

64. ప్రణవము = ఓమ్ అను నక్షరము.

65. పరబ్రహ్మ = పరమాత్మ; నిఖిల, అజ + అండ, పఙివి = సమస్తమగు గ్రుడ్డురూపమైన ప్రకృతికి భర్తవు; శ్రీ = కీర్తి; విభవ = సంపద; ఆరోగ్య; ఆయుః; ప్రావీణ్య = నేర్పు; ప్రాభవము = దొరతనము — వీనియొక్క; ఏకఫలదుఁడవు = అసమానమైః ఫలితమునిచ్చువాఁడవు.

దక్షిణదేశ వివిధ వాఙ్మయములలోలేని యొక యపూర్వరచన ఉదాహరణ వాఙ్మయము తెనుఁగున గలదు. ఉదాహరణమనఁగా భాషయందలి యేడు విభక్తులు, సంబోధ విభక్తితోఁ గలిసిన స్తుతిరూపకమైన చిన్న కావ్యము. భక్తిని ప్రబోధించు మన కావ్యములలో ముఖ్యముగ శైవకావ్యములలో నీ యుదాహరణములు 12వ శతాబ్దమునకుముందే యున్నవి. మనకు దొరకు మొదటిది పాల్కురికి సోమనాథుని 'బసవోదాహరణము'

ఉదాహరణ కృతులలోఁ బలుతెగలు గలవు. హరవిలాసమున గాననగు నీ యుదాహరణము 'విద్ధళి' యనఁబడును. "సంబుద్ధితోఁడ విషమ విభక్తులతోఁడ బలికిన కృతియు విద్ధళి యనంగ" అని అప్పకవీయమున దీని లక్షణము జెప్పఁబడినది. ఈ యుదాహరణ

మున పంచమీవిభక్తి లేదు మిగత విభక్తులు ఏమ. అవి విషమ విభక్తులు గలవి. కాన నది 'విద్ధః'.

66. బాల + ఇందు కళా = లేత చంద్రరేఖను ధరించినవాఁడా; మంటీఁ = బ్రతికితిని.

67. వాచ+అగోచర = మాటలచే తెలియరాని; వివేక = జ్ఞానమునందు; వైయాత్యునిచే = దిట్టతనముగలవానిచే; అర్థిఁ = భక్తితో.

68. అహన్+నిశఁ = పగలురాత్రులందు. వేదండ = ఏనుఁగుయొక్క. కరటివైరి = గజాసురుని విరోధియగు ఈశ్వరా.

69. నిశ్శాట జఘన = వస్త్రములేని మొలగల (దిగంబరుఁడు) శివుఁడా; కైటభ+అరాతి = విష్ణునిచే; హాటకగర్భ = బ్రహ్మచే; వంద్య = నుతింపఁబడువాఁడా; జూట = జడముడియొక్క; వాటికా = వరుసచే; వికట = వంకరయైన; గగనగంగాస్రవంతిక = ఆకాశగంగానదిని గలవాఁడా.

70. శర్వా = శివా; అజునకు = బ్రహ్మకు; ఈయనువు = ఈవిధము.

71. శశిన్ శ్రవఃకుండలా = పాములను + చెవిపోగులుగాఁగలవాఁడా; శైల+ఇంద్రజ+వల్లభ = పర్వతరాజగు హిమవంతుని కుమార్తెకు భర్తయగువాఁడా; దక్ష+అధ్వర = దక్షుని యజ్ఞమును.

72. భోగభృత్ = పడగలనుధరించు పాములను కుండలములుగల శివా; ఉదగ్రతఁ = భయంకరముగా; ముష్టిఘట్టనఁ = పిడికిటి పోటులచే; నొంచితిఁ = బాధించితిఁ.

73. స+అష్ట+అంగ+ప్రణామంబు = ఎనిమిది యంగములకూడికతోఁజేయు వందనము.

74. అభవ = జన్మమే లేనివాఁడా; ఈప్సితము = కోరఁబడినట్టిది.

75. శాంభవి = పార్వతి; మందస్మితంబు = చిఱునవ్వు; కందళింపఁ = మొలువగ; వాసర+అవసాన = పొద్దుగ్రుంకువేళయొక్క; కరటిదనుజ = గజాసురునియొక్క; కుంభకూట = కుంభస్థలముయొక్క పైభాగమునందలి; కూటపాకలజ్వర = ఈ పేరుగల జ్వరముచే; శిరస్+తోదంబును = తలను నొప్పించినదియును; సమీరంబును = గాలియును; ప్రద్యోతన = సూర్యునియొక్క; హవ్యవాహంబును = నిప్పును; స+ఉపసంహారంబు = మరలించుటతో; సంకీలకంబు = మర్మముతో; సమానన్నులు = మిక్కిలిదాపైనవారు; అక్షయ = ఎప్పుడు తగ్గవి; తూణీరము = అంబులపొది.

## పూర్వగాథలు.

త్రిపురాసురులు :— దేవతలను బాధలుపెట్టుచుండిరి. వారు శివునివేడగా, శివుఁడు రక్కసులపై దండెత్తెను. భూమిరథముగ, వేదములు గుఱ్ఱములుగ, సూర్యచంద్రులు

చక్రములుగ బ్రహ్మ సారథిగ జేసికొని రుద్రుఁడు వారితో యుద్ధమొనర్చెను. ఆ రక్కసులు లొక్కచోట కలసిననే వారికి చావని వరముగలదు. అందుచే నీశ్వరుఁడు వారి నొక్కచోటచేర్చి చంపెను.

గజాసురుఁడు :— ఇతఁడు దేవతలకు కీడు చేయుచుండెను. శివుఁడు వానిని జంపవచ్చెను. అప్పుడతఁడు "దేవా! నీ చేతిలో చావుఁగోరి యిట్లొనర్చితిని. నన్ను చంపి నా చర్మము ధరింపుఁడని వేడెను. శివుఁడట్లే యొనర్చెను.

జలంధరుఁడు :— మన్మథుని జంపినపుడు శివుని నేత్రాగ్ని సముద్రమున బడెను. అందుండియే జలంధరుఁడు సముద్రమున బుట్టెను. అప్పుడొక బ్రహ్మాండ శబ్దమయ్యెను. అది విని బ్రహ్మ యేమని విచారించి, విషయముదెలిసి వానికి జలంధరుఁడని పేరు పెట్టెను. శివునిచేఁదప్ప నితని కితరులచేఁ జావులేదనియెను. అతఁడు ఇంద్ర విష్ణువులను, దేవతలను బాధించుచుండెను. నారదుఁడు పార్వతిని గైకొనరాదాయని వానిని బురికొల్ప దానికా వెఱ్ఱివాఁడట్లే శివుని పార్వతినిమ్మని కబురంపెను. శివుఁడు కదన వానిని కడతేర్చెను.

అంధకాసురుఁడు :— బ్రహ్మచే వరములుపొంది [illegible] లోకములను బట్టి తిప్పించువాఁడు. పార్వతినిగూడ తెండని భటులబంపెను. శివుడితనిని చంపెను.

---

## కావ్య విమర్శ.

కవి :— మనము జదువఁబోవు 'కిరాతార్జునీయమ'ను పద్యభాగము హరవిలాస కావ్యములోనిది. దీని రచయిత శ్రీనాథ కవి. ఇతఁడు శైవుఁడైన పాఁకనాటి నియోగి బ్రాహ్మణుఁడు. పద్మపురాణమును వ్రాసిన కమలనాభుని మనుమఁడు కాన పండిత వంశమునకు జెందినవాఁడు. ఇతని తండ్రి మారన, తల్లి భీమాంబ.

ఇతని జన్మస్థలమునుగూర్చి పెక్కు వివాదములు గలవు. స్థూలముగా నితని నివాసస్థానము కొండవీటిసీమ యనవచ్చును. ఇతఁడు కర్ణాటుఁడని కొందఱి మతము. కాని యితని రచనలు, దేశాటనమునుబట్టి యాంధ్రుఁడే యని నమ్మఁదగును. ఇతఁడు పోతనకు బంధువనుట సత్యదూరము. ఇతని దగ్గఱ బంధువులలో నాచికేతూపాఖ్యానమును వ్రాసిన దగ్గుపల్లి దుగ్గన యితని భార్య తోఁబుట్టువు. రాజమహేంద్రవర నృపతి వీరభద్రారెడ్డి మంత్రియగు బెంటపూఁడి యన్నయామాత్యుఁడు సఖియొకఁడు.

శ్రీనాథుఁడు చిన్నారిపొన్నారి చిఱుతప్రాయముననుండి కవనమల్ల నారంభించెను. ఇతని కావ్యములు 1. పండితారాధ్య చరిత్ర, 2. మరుత్తరాట్చరిత్ర, 3. శాలివాహనగాథాసప్తశతి, 4. శృంగారనైషధము: 5. భీమఖండము, 6. కాశీఖండము; 7. హరవిలాసము. 8. సందనంకటము. 9. పల్నాటివీర చరిత్రము, 10. క్రీడాభిరామ మనునవి. పల్నాటి వీర చరిత్ర క్రీడాభిరామ గ్రంథకర్తృత్వమునుగూర్చి యభిప్రాయ భేదములు కలవు. కాని యవియు శ్రీనాథ కృతములే, క్రీడాభిరామమునే వీథినాటకమని కొందఱందురు. మఱికొందఱితని చాటువులుగల యొక గుచ్ఛి గ్రంథమును వీథినాటకమందురు. కాని నిజమైన వీథి నాటక లక్షణములుగల నాటకము లేనేలేదు.

శ్రీనాథుఁడు మహాపండితుఁడు, సర్వశాస్త్రజ్ఞుఁడు, అపారమగు లోకానుభవముగలవాఁడు. దేశాటనమొనర్చి నానారాజుల సందర్శించి రాజభోగముననుభవించెను. వీరభద్రారెడ్డి యాస్థానమున విద్యాశాలాధిపతిగాఁ గొలువు చేసెను. కర్ణాటరాజ్యమున డిండిమభట్టు ఓటమిపరచి జయపతాకఁ గొల్లగొట్టెను. విద్యానగర రాజ్యమున ప్రౌఢదేవరాయల సభలో కనకాభిషేకగౌరవము బొందెను. ఆంధ్రవల్లభుఁడగు మైలారురెడ్డిని, సర్వజ్ఞ సింగమనాయని దర్శించి రాజమన్ననలందినాఁడు. పల్నాటిసీమలోని పల్లెపట్టులతిరిగి యా దేశాచారములను చాటువులలో జీవము పోసినాఁడు. దక్షిణమున గంచివఱకు పర్యటించెను. కంచిలో గొప్ప ఓడవ్యాపారి అవచి తిప్పయసెట్టి. అతఁడు కొండవీటి ప్రభువు కొమరగిరిరెడ్డి యాస్థానమున సుగంధద్రవ్య భాండాగారాధ్యక్షుఁడు. అతనికే మన ప్రస్తుత పఠనీయమగు 'హరవిలాసము' సంకేతమిచ్చెను. ఇతఁడు 'కవిసార్వభౌముడ'ను బిరుదాంచితుఁడు. ఆనాఁటి పరిస్థితుల మన స్తత్త్వమునుబట్టి తన కావ్యముల శృంగారమున నింపెను. శైవుఁడైనను నితరమతములయెడ నితనికి సహనము గలదు. ఇటని కావ్యరచన—దేశాటనములఁబట్టి యితఁడు క్రీ.శ. 1384-1455 సం॥ మధ్యకాలమున బ్రతికియుండెనని భావింపదగును. ఇతఁడంత్యదశలో మిక్కిలి దీనస్థితికి లోనయ్యెను. ఆంధ్రసాహిత్యమున శ్రీనాథునివంటి ప్రతిభగల కవి లేనేలేఁడు.

కావ్యము :— హరవిలాసము సంపూర్ణ శైవగ్రంథము. సిరియాళ చరిత్ర (1, 2 ఆశ్వా.) కొన్ని పురాణములనుండియు; గౌరీకల్యాణము (3, 4 ఆ.) కాళిదాస కుమారసంభవమునుండియు; పార్వతీ పరమేశ్వరుల దారుకా వనవిహారము (5 ఆ.) హాలాహల భక్షణము (6 ఆ.), కిరాతార్జునీయము (7 ఆ.) ననునవి భారవి కిరాతార్జునీయము నుండియుఁ దెనుఁగింపఁబడినవి. ఇట్టిది యేడాశ్వాసముల గ్రంథము. కాంచీపురమునందే గ్రంథరచనము సాగినది. దీనివెనుక వ్రాసిన గ్రంథము కాశీఖండము. ఈ కిరాతార్జునీయ కథ భారతారణ్య పర్వమునను గలదు. దానినిసైతమితఁ డనుసరించినటులున్నది.

కవిత :— శ్రీనాథుని కవిత రాచఠీవి గలది. భాష లక్షణబద్ధము. ఎక్కడనో వాగ్వివాదము, ఒకయింత రేకను, స్థానము పున్నగు స్వతంత్రప్రయోగములు కొన్ని యున్నవి. శైలి సంస్కృత సమాసమయమై యౌద్ధత్యముతో నుండును. ఎన్ని వేల గ్రంథముల మధ్యను చక్కఁగ దెలియవచ్చు శైలి యితనిది. ఇతని హరవిలాసము తెలుఁగు నుడికారములకు నిధి. అన్నింటికన్న ఆంధ్రభాషలోఁ బలువిధముల నొయ్యారముగ సీసమువ్రాయు నేర్పు శ్రీనాథునిదే. ఈక్రింది యితని సీసపద్యముల మనమొరవడిగ నుంచుకొనవచ్చును.

1. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర.
2. దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల.
3. కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా పురవీధి నెదురెంత పొగచదంత.
4. కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి రత్నాంబరములే రాయఁడిచ్చు.
5. లోలాక్షకునీకు లోలోన నేమేని పోటుపుట్టదుగదా మాటమాట.
6. గొజ్జంగి పూ వేనె కులికిమేదించిన కమ్మని కస్తూరి మేన గలయసలది.
7. సొగసు కీల్జడదాన సోగకన్నులదాన వజ్రాలవంటి పల్వరుసదాన.

ఇతని కవితలో నపార్థకపదములు లేవు. సందర్భమునకుఁదగిన చిత్రరచనా శిల్పమితనిసొత్తు. కావ్యమున సంభాషణలెదుట జరిగినటులుండు. ఉదాహరణమునకుఁ గిరాతార్జునుల సంభాషణము జూడవచ్చును.

"కమ్మని తెల్గుబాస నుడికారపు సొంపు, రసంబుపెంపు, పా
త్రమ్ముల రూపవర్ణన, సుధామయ సంస్కృత మంజు వాక్ప్రపూ
తమ్ములధాటి, భావముల రమ్యతయుం గవిసార్వభౌమ! నీ
సొమ్ములు"—ఈ స్తుతి 'కవిరాజున'నకెంతయుఁ జెల్లును.

## కథా సారాంశము.

అర్జునుఁ డింద్రకీల పర్వతమున దేవేంద్రుని యానతి ప్రకారము శివునిగూర్చి తపము జేయుచుండెను. భీష్మాది కురువీరుల జయింప పాశుపతమును బడయుటే వాని ఘోరవీర తపమునకుఁ గారణము. ఆ సమయమున శివుఁడర్జునుని బరీక్షింపనెంచి మూకాసురుని పంది రూపమున బంపి, వేదముల వేఁటకుక్కల గావించి తానొక బోయవాఁడయి, పార్వతి చెంచెత

యయి, భూతగణములు వేఁటకాండ్రయి వెంటనంట పందిని తఱుముచు నర్జునుని సమీపించెను. ఆ పంది భయంకర ఘుర్ఘుర ధ్వనులతో, కన్నులతో నిప్పులుగ్రక్కుచు పోవుచుండెను. హరుఁడు; నరుఁడు నిద్దఱు పందిపై బాణముల వైచిరి. అర్జునుని దెబ్బతో నది గిఱ్ఱున నేలఁ గూలెను. కిరాతరూపముననున్న శివుఁ డర్జునునితో గర్వించి యిట్లనియె. "నే వేఁటాడు పందినేల వేసితివి? నేనీ యాటవిక చక్రవర్తిని. దీనిని జంపి మా యుత్సాహమును జంపితివి. తపస్వివైయుండియు నీకీ వేఁట యెందుకు? మాచే చచ్చిన పీనుఁగును చంపిన మొనగాఁడవు!" అని యధిక్షేపింప నర్జునునకును గోపము వచ్చెను. ఇరువురకు మాటపట్టింపులు జరిగినవి.

పరస్పర బలప్రతాపమును బ్రదర్శింప నిచ్ఛగించిరి. హరార్జునులు భయంకరమగు నస్త్రయుద్ధము గావించిరి. శివునిమాయచే నర్జునుని యస్త్రవిద్యాపరిగల్భత చెడెను. కాని యర్జునుఁ డోపినంతకు మహాపరాక్రమమున శివునిపై బాణవర్షము గురిపించెను. కొంత తడవునకు శివుఁడర్జునునితో మల్లయుద్ధమునకుఁ దలపడెను. వివిధగతుల వీరవిక్రమ ముష్టి యుద్ధమొనర్చిరి. కోపమున గిరీటి శివుని యురమున బిటికిటఁ బొడిచెను. వెంటనే శివుఁడు సాక్షాత్కరించెను. పార్వతి శివగణములు ప్రత్యక్షమైరి. అర్జునుఁడు కృతార్థుఁడై శివుని స్తోత్ర మొనర్చెను. తనతప్పుల మన్నింపఁ బ్రార్థించెను. శివుఁడర్జునుని తపమునకు మెచ్చి పాశుపతాస్త్రము నొసంగెను.

---

## ప్రశ్నోత్తరములు.

1. కిరాతార్జున కథను సంగ్రహముగ వ్రాయుము.
   అర్జునుఁడే విధమున పాశుపతాస్త్రమును బడసెను?
   ఈశ్వరుఁ డర్జునుని యెట్లు పరీక్షించెను?
   అర్జునుఁడు శివసాక్షాత్కారము నెట్లు పొందెను?

తొల్లి యర్జునుఁడు దేవేంద్రునానతి నింద్రకీల పర్వతమున శంకరునిగూర్చి తపమొనర్చుచుండెను. భీష్మాది కురువీరుల సులభముగ గెల్చుటకై పాశుపతాస్త్రమును బడయఁగోరి ఘోరవీరతపమున నిమగ్నుఁడయ్యెను. అతఁడు నెలయేళ్ళఁ దానమాడి రుద్రు నతి భక్తి నిష్ఠలతో త్రిసంధ్యల, అర్ధనిశల ధ్యానమొనర్చెను. పంచాక్షరీ మంత్రమును జపించును.

ఒకనాఁడు కిరీటి శివార్చనకై ఆకులు, పూవులు గోయుచుండఁ గొన్ని వేఁటకుక్కల 'బౌబౌ' ధ్వనులు వినఁబడెను. కొంతసేపటికే వేదత్రయమూర్తులగు కుక్కలు శరభవింత

శార్దూలములకంటె పొగరుమిగిలి వచ్చుచుండెను. అటువెనుక కిరాతవేషధారియైన శివుడు తన యిరువైపుల శివగణములు వనచరులై కొలువ, పార్వతి చెంచెతకాగా నర్జునుడున్న తపోవనమునకు వచ్చిరి. ఇంతలో నీలమేఘముపోలు పందియొకటి కన్నుల నిప్పులు గ్రక్కుచు నావైపున బఱువెత్తెను. అది పుట్టలను పెల్లగించుచు, చెట్లను సమూలముగ పెల్లగించుచుండెను. ఆ పందిరూపమున నున్నవాడు మూకాసురుడు. శివుడు పినాకచాపమున, నర్జునుడు గాండీవచాపమున వజ్రసమాన బాణములను విడిచిరి. బాణవేదనకు పంది యటునిటు తిరుగాడెను. కొంత శివుని బాణముతో నది క్రిందబడి మరణించెను.

కిరాతవేషధారియగు శివుడర్జునుని సగర్వముగా నీవెవడవురా? నాయెదుటఁబడు పందివేసితివి. ఈ యింద్రకీలపర్వతమేలు ఆటవిక చక్రవర్తిని. నన్నెఱుగవా? నేను నా భార్య బహుమృగముల జంపుచు నీ పందినేయ వచ్చితిమి. పందెమున నా భార్య నోడింప నుంటిని. ఇంతలో నాకు రాని యానందమునంతయు చెఱచితివి. నీవు తపసివై యుండియు ధనువు బట్టితివి. శాంతిపరులగు మీకు జంతుహింసయేల? దొంగసన్యాసి! నా పందినేయుటకు నీవెవ్వడవురా? ఇపుడు దీనిని జంపినది నేను. నీవు చచ్చినదానిని జంపితివి. పీనుగపై పోయిన నీ శరమెంత వెఱ్ఱిదో? నీవు మునివిగాన బ్రతికితివి" అని రెట్టించి పలికెను.

ఆ మాటలకు రోషించి కిరీటి "పైబడు క్రూరజంతువును జంపుట నింద్యము? శబరా! నీ వంకరమాటలు కట్టిపెట్టి నీ త్రోవను బొమ్ము. నీవు పందినే కోరెదవో? పందెమునే గెల్చెదవో? ఆ ఫలమునే పొందుదువుగాక! ఈ మాటలేల? మధ్యాహ్నమైనది. నాకు శివార్చన కేకాంతము కావలయు. వేటచే మీరందఱు శ్రమించితిరి. పాపమీ యాశ్రమమున గొంత విశ్రాంతి గైకొనుడ"ని పరిహసించెను. ఈ మాటలకు గిరాతునకు రెట్టించిన రోషముగ్గి మోముద్దము త్రిప్పి "పందితో మాకేమి ప్రయోజనము? మాతో నధిక్షేపించితివి. ఇది తప్పు. అయినను తపసివిగాన క్షమించితిని. తాటిచెట్టంత వింటిని ధరించితివి. నీవేమి తపసివయ్యా? నీ తపసితనము బూటకము నిన్నుజూచినదే నా హృదయము పొంగుచున్నది. నీ బాహాబలమును జూపగలవా? నన్ను చెంచనియెంచక నాతో గొంతసేపు యుద్ధముచేసి నన్ను మెప్పించితివా నిన్ను సెరాసందున"ని యర్జునుని పోరునకు బురికొల్పెను.

నరహరులు గుణధ్వనులు గావించిరి; బాణముల విడచిరి; ఒకరి బాణముల నింకొకరు ఖండించిరి. పరస్పరము గర్వించి భయంకర యుద్ధము గావించిరి. బాణములు కప్పబడి నభ మంధకార బంధురమయ్యెను. మాయచే శివుడర్జునుని శక్తిని దగ్గించెను. అర్జునున కెక్కువ పట్టుదల గల్గెను. గాండీవమునుండి వెడలిన బాణములు శివుని ప్రత్యంగములను బాధించెను. శివుని శిరమునగల మిన్నేటి తరంగలలో జటలు తాండవమాడెను. వింటి యుద్ధమున శివునకు విసువెత్తి మల్లయుద్ధమునకు దలపడెను. అర్జునుడును నందులకు దీకొనెను.

వివిధ భంగిమములలో ముష్టియుద్ధము ఘోరముగ నొనర్చిరి. కిరాతపతి నర్జునుడు తన పిడికిటిపోటున ధూర్జటి తొమ్మన బొడిచెను.

శివుడు వెంటనే దయగలిగి నాగహారములతో, గంగగలవేణితో, గజచర్మాంబర ముతో, ఎఱ్ఱని జటలతో బ్రత్యక్షమయ్యెను. చెంచెత పార్వతిగ వనచరులు శివగణములుగ రూపొందిరి. పైన దేవత లంజలులొనర్చిరి. అర్జునుడాశ్చర్యమున నానందబాష్ప లోచనములతో భక్తినిండార శివస్తుతి గావించెను. "జయ సర్వేశ్వరా! ఈశా! రక్షింపవే. కొండ కిరాతుడవని యనరానిమాటలన్నాను, బాణములు విడిచితిని; పిడికిట బొడిచితిని. అనేక విధముల ద్రోహమొనర్చితిని. నా తప్పులు క్షమింపవే"యని సాష్టాంగ నమస్కారము గావించెను.

భక్తవత్సలుడగు శివుడర్జునునిమెచ్చి యతడు కోరిన పాశుపతాస్త్రమను దివ్యాస్త్రము నిచ్చెను. దాని ప్రయోగోప సంహారవిధుల జక్కగా నుపదేశించెను. కిన్నర కింపురుషాదులు దివ్యాయుధము లొసంగిరి. పైవిధమున నర్జునుడు శివసాక్షాత్కారమును బడసి పాశుపతాస్త్రమును, మఱికొన్ని దివ్యాస్త్రములను బడసెను.

## 2. పందినిగూర్చి నరహరులకుఁ గల్గిన బాణ మల్లయుద్ధమును వర్ణింపుము.

కిరాతార్జునుల కలహమునుగూర్చి వ్రాయుడు.

కిరాతార్జును లేల యుద్ధము గావించిరి?

కిరాతార్జునుల సంభాషణము.

అర్జునుడింద్రకీలమున పాశుపతము బడయ శివునిగూర్చి తపము జేయుచుండెను. శివుడు వానిని బరీక్షింపనెంచి కిరాతవేషమున గిరీటియున్న వనమున కేతెంచెను. వెంట శివగణములు మాఱురూపున వనచరులుగ, పార్వతి చెంచెతవలె, వేదత్రయము వేటకుక్కలవలె నుండిరి. మూకాసురుడు పందియై పాఱుచుండెను. దానిని నరహరులిద్దఱు బాణములఁ గొట్టిరి. వజ్రసమానములైన వారి బాణములు నాటినవి. పంది వేదనచే నటునిటు తిరుగాడుచుండెను.

అభవార్జునల బాణపాతమునకుఁ బంది ప్రళయవేళ మేఘగర్జనలు గావించెను. కడకు శివుడర్దాని నేలఁగూల్చెను అప్పుడు శివుడు సగర్వముగా "ఓరీ! నాయెదుటఁ బాఱు పంది నేసితివి. నీవెవఁడవురా? నన్నెఱుఁగవా? నేనీ యింద్రకీలమునేలు వనచర సార్వభౌముడను నేను నా భార్యయు వేటయందాసక్తులమయి దీనివిజంపఁ బ్రాతిన బూనితిమి. మధ్య నీవు

వచ్చి మా యుత్సాహమును జెఱచితివి గదరా! నీవు తపసివైయుండియు ధనువు బట్టితివి శాంతిపరులకు జీవహింసయేల? నాచేతఁ జచ్చిన దీనిని మరల జంపుటలోఁ బ్రయోజనమేమి? నీవు తపసివిగాన బ్రతికితివి" యని యర్జునుని బరుషముగ మాటలాడెను. అర్జునుడిందులకు రోషించి యడవిలో పైబడివచ్చు దుష్టమృగమును జంపితిని. ఇందులో దోషమేమి? నీ వంటి మాటలు కట్టిపెట్టి వచ్చినత్రోవఁ బొమ్ము. మాటలేల? మాకు శివార్చనకు వేళయగుచున్నది. ఏకాంతము గావలయు. మీరు వేటలోఁ జాల అలసితిరి. ఇందుక మా యాశ్రమమున విశ్రాంతి గైకొనుఁడ"ని పరిహాసముగఁ బల్కెను.

కిరాతుఁడీ మాటలకు మండిపడెను. కాని మెల్లగా యుద్ధమునకుఁ బురికొల్పెను. "నన్ను తక్కువజాతివాఁడనని యెంచకుము. నిన్నుజూచి నా హృదయము పొంగుచున్నది. నీ బాహుబలమును జూపఁగలవా? యుద్ధమున నన్ను మెప్పించిన నిన్ను సెబాసందు" ననెను. అర్జునున కుత్సాహము గల్గెను. గాండీవగుణ ధ్వని గావించెను. శివుఁడు పినాకిని నారిని సారించెను. కఠిన బాణములు పరస్పర మొకరిపై నొకరు వర్షమువలె గురిపించిరి. ఈవిధముగ బందిమూలమున శివార్జునులకుఁ గలహము గల్గెను. శివుని బాణముల నర్జునుఁడును, నర్జునుని బాణములు శివుఁడును ఖండించిరి. ఘోరములగు వారి బాణములు గగనతలమంతయుఁ గప్పివేసెను. చీఁకట్లు దట్టముగాఁ గప్పెను. ఇట్లు కిరాతార్జునులవిచ్ఛిన్నముగాఁ బోరుగావింప, మాయాశక్తితో శివుఁడర్జునునకు శరశూన్యము గావించెను. శరద్వత ద్రోణాచార్యులకడ నేర్చిన విలువిద్య సర్వము నిష్ఫలమయ్యెను.

తన ప్రగల్భతవెలఁగా నర్జునుఁడు బొమలు ముడిచెను. కోపమున గటకటఁబడెను. శరీరమంతయుఁ జెమటలు గ్రమ్మినవి. "ఔరా! నాకు బాణములు క్షీణించుటా? నా యస్త్రవిద్యా పాండిత్య మెటుపోయినది? కానిమ్ము"ని గర్జించి రెట్టించిన రోషమున గంగాధరుని బాణఘాతముల నొప్పించెను. తీవ్రమగు నరుని బాణపాతములజూచి భర్తకెక్కడ నాపద గల్గునోయని పార్వతి గడగడ వణకుచుండెను. శివునిలోని గంగ, చంద్రరేఖ, పెనుఁబాము, నెగకన్ను వాడి నశించుచుండెను. ప్రమదగణములు భయపడుచుండిరి. అంత తీవ్రముగ నర్జునుఁడు బాణముల వేయుచుండెను.

కిరాతునకు బాణయుద్ధమున విసుగుపుట్టినది. "ఏదీ జెట్టిబిరుదము జూతము రావయ్యా!" యని మల్లయుద్ధమునకు శివుఁడర్జునుని యాహ్వానించెను. ఇద్దఱు ముష్టియుద్ధమునకుఁ దలపడిరి. ఉపతాయిలో నృత్యమాడినటులొప్పిరి. అర్జునుఁడు తోరహస్తములో శివుని తొడలు పీడించెను. శివుఁడర్జునుని సోపాన హత్తించి గాలి విడచుటకు వీలులేని బరువు గల్గించెను. పార్థుఁడు శివుని కంఠమూలమును దొక్కురమున బట్టెను. ముంచేతితోఁబొడుచ ముక్కంటి పూఁదమిక్కన్న వెలివచ్చెను. ఈ విధముగాఁ గిరాతార్జునులు తాచుచు, పొడుచుచు, క్రింద

బడుచు, విజృంభించుచు, తపించుచు, బాహాబాహి యుద్ధమొనర్చిరి. ఢీకొని ఘోరమూర్తు లయి, యెవరెవరో తెలియనిరీతిగా ముష్టియుద్ధము చేసిరి. సమవిషమములను మల్లయుద్ధమున చెమర్చుచు, పెదవు లదరుచు సరిసరిగాఁ బెనఁగిరి.

కొంతసేపటికిఁ బార్థుఁడు పిడికిటిపోటున ధూర్జటి యెదపైఁ బొడిచెను. శివునికిఁ దృప్తియైనది. అర్జును బాహుపరాక్రమమునకు మెచ్చి సాక్షాత్కరించెను.

## అర్జునుని గుణశీలములఁ దెల్పుము.

అర్జునుఁడు మహావీరుఁడు; అకుంఠిత దీక్షాపరుఁడు; గురుదైవభక్తుఁడు; అస్త్రవిద్య మల్లవిద్యా విశారదుఁడు; కష్టముల నెదుర్కొని భరించు సహనశీలి; తనకు మించిన కార్యము నైన సాహసమున జేయఁగలఁడు. ఎన్నికష్టములనైన భరించి పట్టుబట్టి కార్యమును సాధించువాఁడు.

ప్రస్తుత కిరాతార్జునీయ కథాభాగమున నర్జునుఁడు త్రిమూర్త్యాత్మకుఁడగు రుద్రునే తన భుజమున నెదుర్కొనెను. శివుఁడు సాక్షాత్కారమైనపుడు తానెవరితో సమర మొనర్చినది తెలియవచ్చినది. కాని విజయము సంపాదించునంతవఱకు శత్రువునకు లొంగక శత్రువే సెబాసనునంత బలపరాక్రమాదులఁ బ్రదర్శించిన మహావీరుఁడు. పాండవులు కౌరవులచే పలుబాధలు పడిరి. కపటపు మాయజూదమున నోడి పండ్రెండు వర్షములరణ్యవాసము, నొక యేఁడజ్ఞాతవాసమునకు లోఁబడిరి. అరణ్యములలో దిక్కులేని దీనులవలె నేల కష్టము లను భవింపవలెను? శత్రువుల జయించు మార్గమే లేదా? యను పౌరుషము కల్గినది విజయునకు. దీనికై ఇంద్రునిగూర్చి తపమొనర్చెను. దేవేంద్రుఁడు పార్థునకు మార్గాంతరము జూపెను. దానిప్రకారమే యర్జునుఁ డింద్రకీలమున శివునిగూర్చి పాశుపతాస్త్రమును బడయఁ దపము చేయ మొదలుపెట్టెను. పాశుపతాస్త్రమున కౌరవవీరుల సులభముగ జయింపవచ్చును.

ఈ యస్త్రమును బడయుటే యితని మహత్తర కార్యము. దీనికై ప్రారమ్భగ నంతు లము, భయంకరమగు నింద్రకీలపర్వతమున దపమునకుఁ బూనినాడు. పులులు, ఎలుగులకు భయమెఱుంగని ధైర్యశాలి. నెలయేళ్లఁ దానమాడి పంచాక్షరీమంత్ర జప దీక్షితుఁడయి, శివుని త్రిసంధ్యల, నర్ధనిశల నిశ్చల ధ్యానమున చింతన జేయుచుండెను. కాలకంధరుని గూర్చి యితఁడొనర్చిన కఠోరమైన వీరతపమే యితని యకుంఠిత దీక్షకు సాక్ష్యము.

కిరాతుఁడు నా పందినేలఁ జంపితివని పరిహాసముజేసినను, దన తపంబునకు [illegible] విఘ్నకారుఁడైనను వెంటనే జితేంద్రియుఁడు కాన

"తడవేతెంచె పుళిందరాజ చను మధ్యాహ్నంబు [illegible]
య్యెడు నీవేళ శివార్చనంబునకు మాకేకాంతమై [illegible]

బడు నన్నాడు. తన తపోదీక్ష మానలేదు. [illegible]

మాట! ఇతఁడు పెద్దలు, దైవమునెడ మహాభక్తిగలవాఁడు. ధర్మజ కృష్ణ లీతని నెంతగా మన్నింతురో దీనినిబట్టియే తెలియును. శివార్చనవేళయైనదఁట! "పైవచ్చు క్రూరజంతువుఁ జేవెరవున నేయుటెందు నెగ్గే జెపుమా" యని పందిని జంపినాఁడు. మరల వెంటనే మనసును దపమువైపు త్రిప్పినాఁడు. ఇదియెంతయు నతని దైవభక్తిపై గల రక్తిని జూపును. కొండలో దొరకు కస్తూరి, కాలాగురు, చందన, అగరు ధూమములు శివునికి నేకరించును. కాంచన కోరకములు, కొండగోగుల శివుని బూజించును. భయములేక కొండగుహల నభవుఁ బూజించు. ఏమి యితని దైవభక్తి!

కిరాతరాజు తన సిబ్బందితో నెదుట నిల్చినాఁడు. పందినిగూర్చి వాగ్వివాదములు పడెను. కిరాతుఁడు యుద్ధమునకుఁ బిల్చెను. అంతమందితో తానొక్కఁడు విరోధము దెచ్చికొనుట మంచిదా? కాదు. కాని యితఁడు సహజ వీరుఁడు; ధైర్య సంపన్నుఁడు. సాహసి. మాటకుమాట నిచ్చినాఁడు. శివుని యాక్షేపముల కన్నిటికిఁ జక్కని జవాబు లిచ్చినాఁడు.

"శాంతిపరులకు నేలరా సత్త్వహింస?"

యని శివుఁడాక్షేపింప నర్జునుఁడు "పైవచ్చు క్రూరజంతుఁ జేవెరవున నేయుటెందు నెగ్గే చెపుమా?" యని సరియైన జవాబు చెప్పినాఁడు. సాహసించి కిరాతునితో నస్త్రవిద్య, మల్లవిద్య గావించెను. శత్రువు మెచ్చుకొను బాహా విక్రమ ప్రావీణ్యమును బ్రకటించెను. కడకు సంతోషముతో శివుఁడు ప్రత్యక్షమయ్యెను.

యుద్ధమున నొక్కొక్కసారి తనశక్తి తగ్గిపోవుచున్నదని యతనికిఁ దెలియును. కాని ధైర్యమునఁ దనకుమించిన యా యుద్ధములఁ బట్టుదలతో నిలిచి విజయమును జేఁబట్టినాఁడు విజయుఁడు. కష్టములన్నింటికోర్చి కడకు పాశుపతాస్త్ర సంపాదనమను తన కార్యమును సాధించినాఁడు. అర్జునుఁడీ యీ గుణముల మనకాదర్శప్రాయుఁడు.

---

## సందర్భసహిత వ్యాఖ్యలు.

### 1. ఎవ్వఁడవురోరి! నా పందినేయ నీవు?

ఈ వాక్యము హరవిలాసమున కిరాతార్జునీయములోనిది. ఇంద్రకీలమున కిరీటి పాశుపతాస్త్రము బడయఁగోరి శివునిగూర్చి తపము జేయుచుండెను. శివుఁడతని బరీక్షింపనెంచెను. పందిరూపమునను్న మూకాసురుని దఱుముకొని చెంచువలె శివగణంబులతో శివుఁడేతెంచెను. ఆ పందిని నరహరులు గొట్టిరి. నరుని బాణముచే నా పంది హతమయ్యెను. ఆ సమయమున శివుఁడీవిధమున బల్కెను. నేనీపందిని తఱుముచున్నాను. నన్నెఱుఁగవా? ఈ యింద్రకీల పర్వతమేలు ఆటవిక చక్రవర్తిని. నా పందినివేయుటకు నీవెవఁడవని యధిక్షేపించెను.

2. శాంతిపరులకు నేలరా సత్త్వహింస? —26 ప.

సందర్భము పైదానికి వలె.

తాపసులు శాంతిపరులు. అట్టివారికి జంతుహింస తగదని భావము.

3. ప్రయోజన మేదీ రండాసుత! దీనిపై శరము నిగుడింపఁగా? 27 ప.

సందర్భము మొదటిదానికి వలెనే. నేనే యీ పందిని జంపితిని. మరల నీవు బాణము వైచితివి. చచ్చినదానిని జంపుటలోఁ బ్రయోజన మేమి లేదని భావము.

4. ఏదో కందువుగా కాఫలము : —31 ప.

ఈ వాక్యము హరవిలాసములోనిది. ఇంద్రకీలమున శివుని గూర్చి యర్జునుఁడు తపము జేయుచుండెను. వానిని బరీక్షింప శివుఁడు కిరాతునివేషమున పంది నొకదానిని దఱుముచు నట కేతెంచెను నరహరులిద్దఱా పందిని గొట్టిరి. కిరీటిబాణమున బంది హతమయ్యెను. ఆ సందర్భమున గిరాతుఁడు గినిసి యర్జునుని దక్కువగా మాటలాడెను. అర్జునుఁ డందులకు రోషించి జవాబు నిచ్చు సందర్భములోని దీ వాక్యము. ఓయీ! శబర పొమ్ము. ఈ వంకరటింకర మాటలేల? పందియె కావలెనో? పందెమే కావలెనో? ఆ ఫల మును బొందుదువు గాక! వృథామాటలేల? ఇష్టమైన నాతో పోరుమని యర్జునుఁడు పల్కెను.

5. శాంతి గైకొనుము వాగ్వివాద మింకేటికిఁగా? —32 ప.

శ్రీనాథ హరవిలాసమందలి దీ వాక్యము. పందికొఱకై నరహరులు వివాదపడిరి. ఆ సందర్భమున పందియో, పందెమో కోరుకొమ్మని యర్జునుఁడు వీరాలాపములాడెను. ఇంకనుగిరాతుని "డస్సినాఁడవు. మేము శివార్చనమొనరింప మధ్యాహ్నమైనది. నీవు విశ్రాంతి తీసికొమ్మ"ని గేలిగా మాటలాడెను. ఆ సందర్భములోనిదే యీ వాక్యము.

మాటకు మాటకీ వివాదమేల? అడవిలోఁ దిరిగి యలసితివి. కోపమేల? శాంతిగా నుండుమని భావము

6. దాంబికుఁడు నీదు తపసితనము : —35 ప.

ఈ మాటలు శ్రీనాథ హరవిలాసకావ్యములోనివి. కిరాతార్జునులు పందికై తగవు లాడిరి. ఒకరినొకరు ఎగతాళి చేసికొనిరి. 'మీరంద ఱలసినారు. ఈ యాశ్రమమున విశ్రాంతి గొమ్ముఁడ'ని యర్జునుఁడు పరిహసింప. శివుఁడు "ఈ వెడమాట లేల? ఈ పంది యొక ప్రయోజనమా? కాని నీవు వేఁటపంతము దప్పితివి. పైగా మమ్ముల నాక్షేపించితివి. నీవు

తపసివి కాన బ్రతికితివి నిన్ను శిక్షింపను. పొమ్మ"ను చెప్పు సందర్భమున కిరాతుఁడీ వాక్యము బలికెను.

నీ వేషమేమో మునివేషము. కాని తాటిచెట్టంత విల్లు నీ గర్వమును జూపుచున్నది. ఇది కేవలము బూటకము. దాంబి కైన తపమని భావము.

ఈ క్రింది పద్యముల ప్రతిపదార్థములు, తాత్పర్యము లతి ముఖ్యములు :

2, 5, 6, 7, 8, 16, 17, 28, 36, 38. 41, 48, 50, 59, 62.



# ఛందస్సు.

తాళ లయానుబద్ధమగు పద్యలక్షణములఁ దెల్పునట్టిది ఛందశ్శాస్త్రము. అక్షరముల నన్నింటిని గురు లఘువులని రెండు విధముల విభజించియున్నారు. గురు లఘువుల చక్కఁగా గుర్తించుట ముఖ్యము.

**గురువులు :—** దీర్ఘాచ్చులు (ఆ, ఈ, మొ॥). దీర్ఘాచ్చులు గల హల్లులు. (కా, గో మొ॥). పూర్ణానుస్వారయుక్తాక్షరములు (కం, దం మొ॥). విసర్గముతోఁగూడిన వర్ణములు (దుః, సః మొ॥). పొల్లులతో గలసిన హల్లులు (కన్, నన్ మొ॥). సంయుక్త ద్విత్వాక్షరములకు ముందున్న అక్కరములు (రక్త, అత్త, .. వీనిలో ర, అ. గురువులు.)

**లఘువులు :—** పై నియమములకు మిగిలిన యక్షరములు * లఘువును మాత్రయందురు. మాత్రయన చిటికవేయునంతకాలము. రెండుమాత్ర లొక గురువు. లఘువునకు గుర్తు = । ; గురువునకు గుర్తు = ౮.

**గణములు :—** గురులఘువుల సమ్మేళనమున గణములగుచున్నవి. వీనిని సూర్య, చంద్ర, ఇంద్రగణములని వ్యవహరించెదరు. విద్యార్థులకు గణలక్షణములు, పద్య లక్షణములు కంఠస్థములగుట అత్యవసరము గాన లక్షణపద్యముల నిట నుదహరించెదను.

**ససగణములు :** గురువులు మూఁడిడ మగణము
పరగంగా నాదిగురువు భగణంబయ్యెన్
ధరమధ్యగురువు జగణము
సరసగుణా యంత్యగురువు సగణంబయ్యెన్.

నగణంబు మూఁడు లఘువులు
యగణంబున కాదిలఘువు యమతనయనిభా
రగణంబు మధ్యలఘువగు
తగణంబున కంత్యలఘువు దాక్షిణ్యనిధీ.

---

* ఒత్తక్షరములు (ధ, భ మొ॥); వట్రువసుడిగలయక్షరముల (కృ, వృ మొ॥) కు ముందున్న అక్షరములు: సమాసముగాని విడిపదములపై వచ్చు ద్విత్వసంయుక్తాక్షరములకు ముందున్నదియు లఘువే. ఉ॥ అది ప్రాప్తించె. ఇచట ప్రా. కు ముందు 'ది' లఘువే. అద్రుచు, ఎద్రుచు మొ॥ వానిలో మొదటియక్షరములు లఘువులు.

**విషమ గణములు:** లలమునకు రెండు లఘువులు
వలనొప్పగ లఘువు గురువు వగణంబయ్యెన్
గలమయ్యె గురువు లఘువును
జలజాక్ష గగ మనంగ జను గురు యుగమున్.

**ఇంద్ర సూర్య గణములు :**
నల, నగ, సల, భ, ర, తలు నా
నెలమిని నీ యాఱుగణము లింద్ర గణంబుల్
గల, నగణము లీ రెంటను
జలజాప్త గణంబులయ్యె జగదాధారా!

## యతి — ప్రాసములు

పద్యముల ప్రతిపాదమున నియమితస్థానమున నాదియక్షరమునకు మైత్రియక్షరమును వాడుటను యతి యందురు. ఉదా॥ రాముఁడేరీతి లంకకు రాగలండు? ప్రతి పాదమున రెండవయక్షరము ప్రాసము. ప్రాసమున హల్లే ప్రధానము కాని యచ్చు గాదు. ఉదా॥ ర, రి, రు, రొ- ఈవిధమున వ్రాయవచ్చును. యతులు స్వర, వ్యంజన, ఉభయ, ప్రాస యతులని నాల్గువిధములు.

## యతి మైత్రి గల అక్షరములు

1. అ ఆ ఐ ఔ
2. ఇ ఈ ఎ ఏ ఋ ౠ
3. ఉ ఊ ఒ ఓ
4. క ఖ గ ఘ — క్ష
5. చ ఛ జ ఝ — క్ష
6. ట ఠ డ ఢ
7. త థ ద ధ
8. ప ఫ బ భ మ
9. ప ఫ బ భ వ
10. ల ళ డ
11. న ణ ఞ
12. ర ల ళ
13. అ య హ
14. శ ష స — క్ష.

## పద్య లక్షణములు.

### ఉత్పలమాల :

| భ | ర | న | భ | భ | ర | వ |
|---|---|---|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |
| ఏసెం బి | నాక చా | పమున | నీశుండు | గాండివ | కార్ముకం | బున |

లక్షణము : ఈ పద్యమున భ ర న భ భ ర వ అను గణములున్నవి. 'ఏ—ఈ' అను నక్షరములకు 10 వ చోట యతి.

### చంపకమాల :

| న | జ | భ | జ | జ | జ | ర |
|---|---|---|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I | I U I | I U I | U I U |
| విసుత | మహాఫ | లం బను | భవించి | తివంచు | ను జాటి | చెప్పుమా |

చంపకమాలకు న జ భ జ జ జ ర అను గణములుండి 11-వ యక్షరమునకు యతి చెల్లును. "వి—విం"కి యతి మైత్రి. చంపకమాల మొదటి రెండు లఘువుల నొక గురువుగా మార్చిన ఉత్పలమాల యగును.

### శార్దూలము :

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| నీకై యే | ను దపం | బు చేసి | తి మహా | నిష్ఠాగ | రిష్ఠస్థి | తిన్ |

శార్దూలమున మ స జ స త త గ అను గణములుండును. 13-వ యక్షరమునకు ("నీ—ని") యతి మైత్రి.

### మత్తేభము :

| స | భ | ర | న | మ | య | వ |
|---|---|---|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |
| విడు కో | వం బిదె | శాంతి గై | కొనుము | వాగ్వివా | ద మింకే | టికిన్ |

మత్తేభమున స భ ర న మ య వ యను గణములుండును. 14-వ యక్షరమునకు "వి—గ్వి" యతి చెల్లును. ఇందలి మొదటి రెండు లఘువుల నొక గురువుగా మార్చిన శార్దూలమగును.

లయగ్రాహి :

| భ | జ | స | న | భ | |
|---|---|---|---|---|---|
| U I I | I U I  I I U | | I I I | U I I | I |
| యయజ | దగాక్షి | వలరా | యఁడిటు | రేచిప | టు |

| జ | స | న | భ | య |
|---|---|---|---|---|
| U I | I I U | I I I | U I I | I U U |
| తోయ | కిమ లే | ర్చి యిపు | దేయఁగఁ | దొడంగెన్ |

లయగ్రాహికి భ జ స న భ జ స న భ య యను గణములుండును. ప్రతి తొమ్మిదవ యక్షరమునకు మూఁడుచోట్ల ప్రాస యతి యుండును. (తోయ—రాయ—సాయ-దేయ) మొల్లరామాయణమున నీ పద్యమును రెండు గీతల నొక పాదముగా భావింపుఁడు.

కందము :

| నల | నల | భ |
|---|---|---|
| I I I I | I I I I | U I I |
| మనమున | బిగి గల | వారలఁ |

| స | గగ | నల | నల | స |
|---|---|---|---|---|
| I I U | U U | I I I I | I I I I | U I I |
| జనునే | నమ్మం | గ విడువ | చతురవ | చనములన్ |

కందమున గగ, భ, జ, స, నలము లను గణములనే వాడవలయును. మొదటి పాదమున 3 గణములును, రెండవ పాదమున 5 గణము లుండవలెను. ఈ విధమున క్రమమున 3, 4 గణములకు లక్షణము. జగణము బేసిగణముగ నుండరాదు. రెండవ, నాల్గవ పాదముల కడయక్షరములు గురువులుగ నుండవలెను. ఆఱవగణము నలమో, జగణమో కావలయును. పాదముల మొట్టమొదటి యక్షరములన్నియు గురువులుగనో, లేక యన్నియు లఘువులుగనో యుండవలయును. రెండవ నాల్గవ పాదములలో నాల్గవ గణము మొదటి యక్షరమునకు యతి చెల్లును. పై పద్యమున నీ లక్షణములన్నియునున్నవి.

తేటగీతి :

| సూ. గ. | ఇం. గ. | ఇం. గ. | సూ. గ. | సూ. గ. |
|---|---|---|---|---|
| న | భ | ర | న | గల |
| I I I | U I I | U I U | I I I | I U |
| అరయ | నొక్కని | బావు మే | లని త | లంచి |

1 సూ. గ. 2 ఇం. గ. 2 సూ. గ. క్రమముగ తేటగీత ప్రతిపాదమున వచ్చును ఇచట న భ ర న గల మను గణములీ క్రమముననే యున్నవి. యతి నాల్గవ గణాద్యక్షరము (అ. అ).

**ఆటవెలఁది :**

| | | | | |
|---|---|---|---|---|
| సూ. గ. | సూ. గ. | సూ.గ. | ఇం. గ. | ఇం. గ. |
| న | గల | గల | భ | ర |
| I I I | U I | U I | U I I | U I U |
| ప్రగయుఁ | గర్గె | నేని | ప్రాయునె | గూఢమై |
| సూ. గ. | సూ. గ. | సూ. గ. | సూ. గ. | సూ. గ. |
| గల | గల | గల | గల | గల |
| U I | U I | U I | U I | U I |
| క్రమాన | నగ్ని | యున్న | మూడ్కి | నుండు |

ఆటవెలఁదికి 3 సూ గ. 2 ఇం. గ. మొదటి పాదమునను, 5 సూ. గ. రెండవ పాదమునకు నుండును. ఇదేమాదిరి కడమ రెండుపాదములలో నుండును. ప్రతిపాదమున నాల్గవ గణాద్యక్షరమునకు యతిమైత్రి. (ప. పా.) పైపద్య దళమున నిదే లక్షణమును బరికింపుఁడు.

**సీసము :**

| | | | |
|---|---|---|---|
| ఇం. గ. | ఇం. గ. | ఇం. గ. | ఇం. గ. |
| ర | ర | నగ | సల |
| U I U | U I U | I I I U | I I U I |
| నీల జీ | మూత స | న్నిభశరీ | రమువాఁడు |
| ఇం. గ. | ఇం. గ. | సూ. గ. | సూ. గ. |
| భ | ర | న | గల |
| U I I | U I U | I I I | U I |
| తామర | సాభనే | త్రముల | వాఁడు |

సీసమున నింద్రగణములాఱు, సూర్యగణములు రెండు ప్రతిపాదమున నుండును నాల్గు పాదములవెనుక తేటగీతయో, నాటవెలఁదియో చేర్పఁబడును. ప్రతిపాదమున 1, 3 5, 7 గణాద్యక్షరములకు యతిమైత్రి. (నీ-న్ని, తా-త్ర). నాల్గుపాదములకు మించిన పద్యముల మాల (సీసమాల) లేక మాలికలందురు. గీత సీస ద్విపదాదుల ప్రాసయతివి యుపయోగించెదరు.



# అలంకారములు.

అలంకారములు కావ్యభూషణములు అవి శబ్దాలంకారములు, అర్థాలంకారము లని రెండు విధములు.

## శబ్దాలంకారములు

(1) వృత్త్యనుప్రాసము: ఒకటి లేదా కొన్ని హల్లులు తిరిగి తిరిగి వచ్చినచో వృత్త్యను ప్రాసము. ఉ॥ వచ్చె విప్ప చప్పు వరతపోవనముకడకు. —హ. వి.

(2) ఛేకానుప్రాసము: ఎడములేని రెండుహల్లులు మరల మరల వచ్చుట ఛేకానుప్రాస మనఁబడును. ఉదా॥ కుంభకూట కూటపాకల జ్వరశిరస్తోదంబును —హ.వి.

(3) లాటానుప్రాసము: తాత్పర్యము మాత్రము భేదించి, అర్థము వేఱు కాని పదములు గలది లాటానుప్రాసము. ఉదా॥ తొరఁ గెడి చిన్నిటఁ దోఁగి తోఁగి —మొ.రా.

(4) యమకము: అచ్చులు గలసిన హల్లులు తిరిగి తిరిగి వచ్చుట.
ఉదా॥ వనమాలి పఱచు వెఱపుమాలి యధిప — భాగ.

(5) అంత్యానుప్రాసము: పదాంత్యమున వచ్చిన యక్షరములే వచ్చుట.
ఉదా॥ కేశితో కరితో మల్లురతో జరాతనయుతో —. భాగ.

## అర్థాలంకారములు

(1) ఉపమ: ఉపమానమునకును (పోలికకు గైకొన్న వస్తువు). ఉపమేయమునకును (వర్ణింపఁబడు వస్తువు) చక్కని సామ్య మెచట నుండునో యచ్చట ఉపమాలంకారము. ఉదా॥ ఏనుంగులు దీమంబుల పజ్జఁ దగిలి నెట్టన పట్టువడినక్రియన్ —భార.

(2) రూపకము; ఉపమేయములో నుపమాన మారోపితమైన రూపకము.
ఉదా॥ అనసూయ గర్భశుక్తిని రూపుగని... ముక్తాగ్రగణ్యత వహించె —ఉ. రా.

(3) అతిశయోక్తి: ఉన్నదానిని విపరీతముగా వర్ణించుటతిశయోక్తి.
ఉదా॥ హంసరాజగముల పీ రంధ్రమైన నభమున గాడాంధకారముగప్పెను — హ. వి.

(4) నిదర్శన: ఉపమాన ఉపమేయ వాక్యార్థముల నొకటియే యైనట్లు వర్ణించుట. ఉదా॥ తన సాహసము దానే పొగడుకొనువాఁడు గుణహీనుఁడు. రావణుఁ డీట్లొనర్చెను. కాన నాతని మాటలు వినరాదని సీత చెప్పుచున్నది.

(5) లోకోక్తి: లోకమందలి ప్రవాదమును అనుకరించి చెప్పుట. ఉ॥ నా ముందఱ గయ్యమునకుఁ గాలుదువ్వఁ గడంగెను. దీనిని దయ్యాలకు బలివెట్టెద —మొ. రా.

(6) **వ్యతిరేకము :** ఉపమానముకన్న ఉపమేయమున విశేషమున్నట్లు వ్రాయుట. ఉదా॥ చూ. ప. "నరకాంతల్ సరిరారు...." —మొ. రా.

(7) **విషమము :** సమాన సామ్యములు, ధర్మములు కాని రెండు వస్తువుల వర్ణించుట. ఉదా॥ చూ. ప. "జడలు ధరియించి తపసుల...." —మొ. రా.

(8) **దీపకము :** ప్రస్తుతమునకును అప్రస్తుతమునకును వాని గుణసామ్యమును జెప్పినచో దీపకము. ఉదా॥ నీమొగమున కోడిన పద్మములు నీటిలో మునిఁగెను. చంద్రుఁడు మేఘములలో మునిఁగెను.

(9) **కావ్యలింగము** ఒక యర్థమును సమర్థింపవలసినచో దానిని చక్కఁగా సమర్థించుటకుఁ గావ్యలింగమని పేరు. (లింగమన హేతువు). ఉదా॥ దానవులు మానవులను గెలువఁగలరు. మానవులను దిను దానవులను మానవులెట్లు గెలువఁగలరు? —మొ.రా.

(10) **అర్థాంతరన్యాసము :** విశేష సామాన్యములఁ బరస్పర మొకదానిచే నింకొకటి సమర్థింపఁబడుట. ఉదా॥ కురుక్షేత్రమున ధర్మజుఁడే గెల్చెను. ధర్మమునకు జయము సిద్ధమే.

(11) **యథా సంఖ్యము :** వరుసక్రమమున జెప్పిన వానికి సమన్వయము గూర్చుట. ఉ॥ మంచి తలఁపులు, పలుకులు పెంచరు, పలుకరు.

(12) **స్వభావోక్తి :** అన్ని గుణముల స్వభావసిద్ధమును హృదయంగమమును నగు రచన. ఉ॥ నిడుదపెన్నెఱివేణి జడలుగా మలిన జీర్ణాంబరము గట్టిన సీత —మొ.రా.

(13) **సారము :** పూర్వ పూర్వమునకంటె నుత్తరోత్తరమును గొప్పగా వర్ణించుట. ఉ॥ శరభమృగములకంటెఁ గేసరులకంటె —హ. వి.

(14) **అర్థాపత్తి :** ఇట్టిదే యిట్టిదైన దాని సంగతేమి? (కైముతికరీతి) యను విధమున భావమును దెల్పుట. ఉ॥ యాదవుఁ డెంతవాఁడు? ప్రళయాంతకునైన యుద్ధమున గాదనను. —భాగ.

(15) **సందేహము :** భావమును దెలియని రీతిని సందేహముగాఁ దెల్పుట. ఉ॥ యాదవుఁడు పోరాటమునకే వచ్చెనా? ప్రియోక్తులకా? శ్రీగోరియా? —భాగ.

(16) **శ్లేష :** పెక్కు అర్థములు వచ్చునట్లు వ్రాసిన శ్లేష. ఉ॥ రాజా కువలయ ప్రియుఁడు గదా!

# వ్యాకరణ విశేషములు.

## I. సంస్కృత సంధులు.

1. సవర్ణ దీర్ఘ సంధి : అ, ఇ, ఉ, ఋ ల కవేవర్ణములు పరమైనచో దీర్ఘమాదేశమగు.

ఉదా. రోష+అగ్ని = రోషాగ్ని.
అవని+ఈశ = అవనీశ.
శిఖరి+ఇంద్ర = శిఖరీంద్ర.
మృదు+ఉక్తి = మృదూక్తి.
పితృ+ఋణము = పితౄణము.

2. పరరూప సంధి : సారంగాదుల పరరూపము బహుళంబు.

ఉదా. సార+అంగము = సారంగము.
కుల+అట = కులట.
సీమ+అంతము = సీమంతము.

మార్తాండుఁడు, మార్తండుఁడు, బింబోష్ఠ, బింబోష్ఠముల బహుళము.

3. గుణ సంధి : అకారమునకు ఇ ఉ ఋ లు పరమైనచో ఏ ఓ అర్ (గుణము) ఆదేశమగును.

ఉదా. ముని-ఈశ్వరా = మునీశ్వరా.
శైల-ఇంద్రజా = శైలేంద్రజా.
మేచక-ఉత్పల = మేచకోత్పల.
తాపస-ఉత్తమా = తాపసోత్తమా.
సప్త+ ఋషి = సప్తర్షి.

4. వృద్ధి సంధి : అకారమునకు ఇ ఈ ఎ ఏ ఐ లును, ఉ ఊ ఒ ఓ ఔ లును పరమైనచో వరుసగా ఐ ఔ (వృద్ధులు) లేకాదేశమగును.

ఉదా. గుణ + ఏకవసతి = గుణైకవసతి.
సకల + ఐశ్వర్య = సకలైశ్వర్య.
తురగ + ఓఘము = తురగౌఘము.
రస + ఔషధము = రసౌషధము.

5. యణాదేశ సంధి : ఇ ఉ ఋ లకు అసవర్ణములు పరమైన క్రమముగా య్, వ్, ర్ లు ఆదేశమగును.

ఉదా. అతి + ఉగ్ర = అత్యుగ్ర.
గురు + ఆజ్ఞ = గుర్వాజ్ఞ.
మను + అంతరము = మన్వంతరము.
మాతృ + ఆనందము = మాత్రానందము.

## II. వ్యాకరణ విశేషములు.

6. కాయ + కూరలు = కాయ గూరలు.

సూ. ద్వంద్వంబునం బదంబుపైఁ బరుషంబులకు గ స డ ద వ లగు.

ఉ. కూరగాయలు.

7. యుద్ధంబు + చేత = యుద్ధంబు సేత.

సూ. ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు.

ఉ. అధిపత్యము సేయు, శవంబు దొలుచు, అది వోలియుంగ. పుణ్యము సెసు.

8. సంకటము + పెట్టంగ = సంకట పెట్టంగ.

సూ. షష్ఠ్యాదులు పరమగునపుడు మువర్ణమునకు లోపపూర్ణబిందువులగు.

ఉ. తల్లడపడు, భయపడు, కోపపడు.

9. ఆ + కార్యము = ఆక్కార్యము.

సూ. త్రికంబుమీఁది యసంయుక్తాక్షరమునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

ఆ + కార్యము = అక్కార్యము.

సూ. ద్విరుక్తంబగు హల్లు పరమైనపు డాచ్ఛికంబగు దీర్ఘమునకు హ్రస్వమగు.

ఉ. ఇమ్మగువ, ఇమ్మెయిన్. ఎప్పురుషుని, అప్పుడమితేఁడు, అచ్చోటన, ఇప్పని, అయ్యెడన్, అయ్యది, ఇప్పాప, అవ్వరాహము.

10. ఆ + ఇరు = అయిరు.

సూ. సంధిరానిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు పిమ్మట త్రికసంధి సూత్రములచే అయ్యిరు.

11. నెఱ + వగలు = నెవ్వగలు.

(i) సూ. క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబును, గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వమును నగు.

(ii) సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచోఁ గానంబడియెడి.

ఉ. నెమ్మనము, నెమ్మది.

12. ఊరకుండుము—ఊరకుండు.

సూ. మధ్యమ పురుషమువర్ణమునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపంబు విభాషనగు.

ఉ. మేలుఁగు, విడువు, వహింపునాపుడు, చేయు. వర్ధిలు.

13. ఓడకుము+ఓడకుము = ఓడకోడకుము.

సూ. ఆమ్రేడితము పరంబగునపుడు మధ్యమ ముజ్ఞులకు లోపంబు విభాషనగు.

ఉ. ఉండుండుము, పోపొమ్ము, పోకుపోకు, రమ్మురమ్ము.

14. మాటికి మాటికి—మాటిమాటికి, మాటికిమాటికి.

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.

సూ. ఇంచుక నాఁడిత్యాదుల నంత్యమాక్షరలోపంబు.

15. చేసితివి—చేసితి.

సూ. భూత తద్ధర్మార్థక క్రియల వకారమునకు లోపంబు వికల్పముగా నగును.

ఉ. అయ్యెడు, చూచితేని, దొంగిలితి, చూపుదుగాక.

16. వచ్చుదునె—వత్తునె.

సూ. చువర్ణంబుతోడి దుగ్దకారంబు తకారంబగు.

ఉ. చూతము, నిద్రపుత్తు.

17. బలుపు+ఉరి = బలుపుటురి.

సూ. కర్మధారయమునం దుత్తన కచ్చు పరంబగుచో టుగాగమంబగు.

ఏమి+ఒక్కటి = ఏమొక్కటి.

ఏమ్యాదుల యిత్తునకు సంధివైకల్పికము.

18. అగుటకంటె—అగుకంటె.

సూ. కొఱకు, కంటె, పొంటెలు పరమైన భావార్థక టవర్ణమునకు లోపంబు విభాషనగు,

19. దయ్యములకు—దయ్యాలకు

సూ. లు—ల—న లు పరంబగునపుడు ముువర్ణమునకు లోపంబును, తత్పూర్వాచ్చునకు దీర్ఘంబును విభాషనగు:

20. నీ భాగ్యము—నీదు భాగ్యము.

సూ. నీ—నా—త న శబ్దముల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబగు.

నాదు బ్రతుకు, నాదు సిరి.

21. వేడుకకాఁడు—వేడుక కాఱు, వేడుకకాండ్రు.

సూ. కాప్రత్యయముమీఁది బహువచన లకారమునకు లఘ్వలఘు రేఫంబులును, లఘు రేఫమునకుముందు బిందుపూర్వక దకారంబును నగు.

22. కండలు + కండలు = కడికండలు.

సూ. అందదుసు ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు.

ఉ॥ చెచ్చెర.

23. వలయు + ఆహారములు = వలయు నాహారములు.

సూ. ఉదంత తద్ధర్మార్థక విశేషణమున కచ్చుపరమైన నుగాగమంబగు.

ఉ. నమ్మెడునట్లు, తలంచునంతలో, క్రుమ్మరునప్పుడు

24. శిశువు + ఎడఁద = శిశువునెడఁద.

సూ. షష్ఠీ సమాసమునందుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు.

ఉ. రామునానతి.

25. చెఱుగు + తనము = చెఱుగుఁ దనము.

(i) సూ. ఉదంత స్త్రీసమంబులకును, పుంపులకును, సదంత గుణవాచకంబులకును, తనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

26. చెఱుగున్ + తనము = చెఱుగుఁ దనము.

(ii) ద్రుతప్రకృతికమ్ముపై పరుషములకు సరళములగు.

చెఱుగున్ + తనము = చెఱుగుందనము.

(iii) సూ. ఆదేశసరళములకుముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

ఉ. బల్పుఁ బిప్పు, అనుగుందమ్ముని, బ్రతుకుం దెరువు.

27. మువ్వము + తావి = మువ్వంపు తావి.

(i) సూ. కర్మధారయంబుల మువర్ణమునకుంబుంపులగు.

మువ్వంపు + తావి = మువ్వంపుఁ దావి

(ii) సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమ.... 25 (i) వలె.

మువ్వంపున్ + తావి = మువ్వంపున్ దావి.

(iii) సూ. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు.

మువ్వంపున్ + దావి = మువ్వంపుఁదావి.

(iv) సూ. ఆదేశ సరళములకు ముందున్న.......... 25 (iii) వలె.

ఉ॥ తుచ్చపుఁ బల్కులు.

28. వెల్ల + చామరము = వె చామరము.

(i) సమాసంబున ప్రాతాదుల తొలియచ్చుమీఁదివర్ణముల కెల్లలోపంబు బహుళంబుగానగు.

వె + చామరము = వి చామరము.

(ii) అచ్ఛికపదముల వర్ణవికారంబులు పెక్కువిధములు.

వి + చామరము = విం జామరము.

(iii) లుప్తశేషమునకుఁ బరుషములు పరమగుచో నుగాగమంబగు.

విం + చామరము = విం జామరము.

(iv) ద్రుతప్రకృతికముపై పరుషములకు సరళములగు.

కెంజాయ, ముంజేయి, లేఁజిగురు.

29. కన్ను + నీరు = కన్నీరు.

సూ. పదాంతములయిన ను-లు లక్రింది న-ల లకును, ఉకారమునకును లోపంబు బహుళంబుగానగు.

ఉ. మున్నీరు.

30. మూఁడు + కంటి = ముక్కంటి.

సూ. బహుబ్రీహిని సమాసాంతకార్యములుం గానంబడియెడి.

31. వచ్చిన + వాఁడు = వచ్చినాఁడు.

సూ. తచ్ఛబ్దవకారమునకు లోపంబగు.

ఉ. చుట్టినాఁడు, తెచ్చినాఁడు.

32. ఆచరింతురు + ఏ = ఆచరింతురే.

సూ. ఎదాదు లనుప్రయుక్తమగునపుడు ముజ్ఞునకు వుజీ రుజీ యగు.

ఉ. తీర్పవే, ఎఱుంగవే, వినవే, కంటిరే.

